

కామిక్స్ అన్నవి ఇక బోర బోరే
రవి అనుకున్నాడు చెయ్యాలనేదో వేరేవేరే
తనంతట తానే సరదా తీరేలా
ఇతరులు చూసి మురిసిపోయేలా
ఆ! ఈ ఎకో పెన్నులసెట్ నాకు జోడీ
గీనేస్తా నేనింక కూసే ఓ కోడి
అల్లరి పిల్లల బడి, రెండు జడల జోడి.
నాన్న పెంచే మీసం, అమ్మ చేసే పకోడి.
ఎకో పచ్చ ఎకో నీలం
ఎరుపు పసుపు నారింజ రంగుల మయం
ఊదా, నలుపు, వైలెట్
గులాబీ, గోధుమలతో అయ్యేనది ఓ సెట్




# ఎకో
స్కెచ్ పెన్ రంగుతే ఇక రంగులు- సరదాతీర్చే హంగులు!

ప్రిసిషన్ రైటింగ్ పాయింట్స్ (ప్రైవేట్) లిమిటెడ్, 18, సుభాష్ రోడ్, విలే పార్లే (ఈస్ట్), బొంబాయి 400 057.

# సర్ఫ్ కొనడంలో మరింత వివేకం ఉంది

"తెలిసే చెప్తున్నా, సర్ఫ్ కొనడంలో ఉన్నంత వివేకం మరి దేనిలోనూ లేదు. దీని పవర్ ప్యాక్డ్ ఫార్ములా సామాన్యం కాదు— ఉప్పొంగే శక్తి! మీ డబ్బుకి మించిన విలువ ఇస్తుంది!"

**డబ్బుకి మించిన విలువా? అసలే సర్ఫ్ ఖరీదైనది కూడా కదా?**

"చూడండి! దీని వల్ల ఎంత ఎక్కువ ప్రయోజనమో గ్రహించారా మీరు? కేవలం సర్ఫ్ మాత్రమే నా బట్టల్ని అతి తెల్లగా ఉతుకుతుంది. పైగా వాటిని సంరక్షిస్తుంది. అందుచేత అవి కొత్త వాటిలానే కనిపిస్తుంటాయి. అంటే ఎప్పటికప్పుడు ఆదా— లెక్క కట్టి చూసుకోండి. సర్ఫ్, డబ్బుకి మించిన విలువ ఇస్తుందని అందుకే అన్నాను నేను".

**సరే లలితగారూ, కాని అందుకు సర్ఫ్‌లో ఉన్నది ఏమిటి?**

"ఎంతో ఉంది! ఒక కిలో మామూలు రకం పౌడరు ఎంత ఉంటుందో, అంత పౌడరు ½ కిలో సర్ఫ్ ప్యాకెట్‌లో ఉంటుంది. అంటే ఒక కిలో మామూలు రకం పౌడరు ఉతికేటన్ని బట్టల్ని అర కిలో సర్ఫ్ ఉతుకుతుందన్నమాట. చూశారా, సర్ఫ్ నుండి మీరు ఎంత విలువ పొందుతున్నారో?"



ఒక కిలో మామూలు రకం పౌడరు

½ కిలో సర్ఫ్

**అంటే, ఒక విధంగా, సర్ఫ్ తన ధర తిరిగి చెల్లిస్తుందన్నమాట!**

"ఒక విధంగా ఏమిటి, ఎన్నో విధాలుగా! మనకు లాభమే లాభం. చౌక రకం కొనడంలోనూ మంచి నాణ్యమైనది కొనడంలోనూ ఎంతో తేడా ఉంది. అందుకే అంటున్నాను, సర్ఫ్ కొనడంలో మరింత వివేకం ఉందని."



# నోటి దుర్వాసన పోగొట్టుకోండి. దంతక్షయాన్ని ఎదుర్కోండి.



# మీ కుటుంబంలోని వారికి కోల్గేట్ రక్షణ చక్రాన్ని ఇవ్వండి!

క్రమం తప్పకుండా కోల్గేట్ ని వాడటంతో మీ కుటుంబంలోని
వారి నోటి శ్వాస శుభ్రంగా, తాజాగా ఉంటుంది, వారి పళ్లు యింకా దృఢంగా,
ఆరోగ్యంగా ఉంటాయి. కోల్గేట్ రక్షణ చక్రం చేసేది అదే,
వారికది యివ్వడం అందుకే.

మీరు పళ్ళు తోముకున్న ప్రతిసారి, కోల్గేట్ యొక్క నమ్మకమైన ఫార్ములా చేసేదిది-చూడండెలాగో.



మీ పళ్ళలో యిరుక్కుపోయిన ఆహారపు తునకల్లో దుర్వాసన,దంతక్షయం కలిగించే సూక్ష్మజీవులు పెరుగుతాయి.



కోల్గేట్ లోని అద్వితీయమైన శక్తిగల నురగ లోపలికి చొచ్చుకుపోయి, అక్కడ గల దుర్వాసన కలిగించే ఆహారపు తునకల్ని, దంతక్షయాన్ని కలిగించే సూక్ష్మజీవుల్ని తొలగిస్తుంది.



క్రమం తప్పకుండా కోల్గేట్ తో పళ్ళు తోముకుంటే, దాంతో యిక మీకు శుభ్రమైన, తాజా శ్వాస, దాంతోటే దృఢమైన, ఆరోగ్యమైన పళ్ళూను.

భోజనం చేసిన తర్వాత ప్రతిసారీ మీ కుటుంబంలో వారంతా కోల్గేట్ తో పళ్ళు తోముకుంటున్నారని ధ్రువపరుచుకోండి. నోటి దుర్వాసన పోగొట్టుకోండి. దంతక్షయాన్ని ఎదుర్కోండి. వారికి కోల్గేట్ రక్షణ చక్రాన్ని యివ్వండి.




84-55 Tel

దీని తాజా పిప్పరమెంట్ రుచి మీకెంతో నచ్చుతుంది!

# చందమామ

సంస్థాపకుడు : 'చ క్ర పా ణి'
సంచాలకుడు : నా గి రె డ్డి

ఈ నెల బేతాళకథ ["వాగ్దానభంగం"]కు ఆధారం, ఎ. విద్యాసాగర్ రచన.

లోకజ్ఞానం, తెలివితేటలూ, సమయజ్ఞతా లేని మనిషి, ధనార్జన చేయలేడు. కాని, ఈ లక్షణాలతో పాటు, ఆ మనిషిలో ధనం పట్ల కాపీనం లాంటి దుర్లక్షణం చోటు చేసుకుంటే, నలుగురిలో ఎలా నవ్వులపాలవగలడో, "చలమయ్య గోదానం" అన్న కథలో తెలుసుకుంటాం.

## అమరవాణి

తావద్ భయస్య భేతవ్యం, యావద్ భయమనాగతమ్,
ఆగతం చ భయం వీక్ష్యం నరః, కుర్యాద్ యథోచితమ్.

[ప్రమాదం ముంచుకు రానంతవరకు, దానిని గురించి భయపడ వచ్చు; కాని అది వచ్చిన తరవాత, భయపడకుండా దానినుంచి బయటపడడానికి ధైర్యంగా పోరాడాలి.]

సంపుటి 79 అక్టోబర్ '86 సంచిక 4

విడి ప్రతి : 2–50 :: సంవత్సర చందా : 30–00






# "Hey Sweeties, look what's new from NP"




## Jelly Belly and Yogo

A SOFTY AT HEART — CHEWY ALL THE WAY

## In fruity flavours you've never tasted before



Pop in a Yogo. Chew a creamy dream. Just one toffee. But what a juicy mouthful.

Pop in a Jelly Belly. Rock'n roll around the hard coating. Bite it..... Crunch. The soft centre wins your heart - tang!

Get ready for more. Because you'll never lose your taste... long after they mmmelt.

**NP CONFECTIONERY LTD.**

135, Kaval Byrasandra, Bangalore 560 032.

Dattaram/NP/3A-86

పురాణగాథలు :

# ఊర్వశి

పూర్వం ఒకప్పుడు నరనారాయణులు తపస్సు చేస్తూ ఉండగా, వారి తపస్సుకు భంగం కలిగించడానికి, దేవేంద్రుడు అప్సరసలను పంపాడు. దానిని గ్రహించిన నారాయణుడు, గోటితో తన తొడను గీరి, అప్సరసలను మించిన అందచందాలతో ఒక యువతిని పుట్టించాడు. ఆమె అపురూప సౌందర్యాన్ని చూసి, అప్సరసలు సిగ్గుతో తిరిగి వెళ్ళిపోయారు. ఊరువు (తొడ) నుంచి పుట్టడం వల్ల ఆమెకు ఊర్వశి అనే పేరు వచ్చింది. అ తరవాత ఆమె దేవేంద్రుడి కొలువులోని నాట్యకత్తెలలో ఒకతెగా చేరింది.

ఒకనాడు భూలోకం నుంచి పురూరవచక్రవర్తి వచ్చి, దేవసభలో ఊర్వశి నాట్యం చూసి, ముగ్ధుడై, అమెను పెళ్ళాడాలనుకున్నాడు. ఊర్వశి కూడా రాజును వరించింది. దేవేంద్రుడూ అందుకు అంగీకరించాడు. ఊర్వశీపురూరవులు వివాహమాడి, భూలోకం చేరి హాయిగా కాలం గడపసాగారు.

నాలుగు సంవత్సరాలు గడిచాక, దేవతలకు ఊర్వశి లేని లోటు తెలియవచ్చింది. ఆమెను ఎలాగైనా దేవలోకానికి రప్పించాలనుకున్నారు. కొందరు గంధర్వులు భూలోకానికి వచ్చి, ఒక తుఫాను నాటిరాత్రి, ఊర్వశి శయనమందిరంలోని లేడిపిల్లలను దొంగిలించుకుపోయారు. లేడిపిల్లలను వెతుక్కుంటూ, ఊర్వశి అకాశమార్గాన పయనించసాగింది. అలా అలా గంధర్వులు ఆమెను దేవలోకానికి చేర్చారు.

ఊర్వశి కనిపించకపోయేసరికి, పురూరవుడికి మతి చలించినట్టయింది. ఆయన ఎక్కడెక్కడో వెదికి వేసారి, అఖరికి దేవతల అనుగ్రహం కారణంగా ఊర్వశిని కలుసుకుని హాయిగా జీవించాడు.





# చలమయ్య గోదానం

నాగవరం గ్రామంలో వుండే చలమయ్యకు డబ్బుకాపీనం ఎక్కువ. ఆయన కొక సారి జబ్బు చేసింది. అది ఏ మందులకూ లొంగలేదు.

చలమయ్య తల్లి శాంతమ్మ, ఆయనతో, "చచ్చి స్వర్గాన వున్న, నీ నాయనకూ, ఒకసారి ఇలాంటి జబ్బే చేస్తే, సద్బ్రాహ్మణుడొకాయనకు గోదానం చేశాడు. వెంటనే తగ్గిపోయింది," అన్నది.

"నా జబ్బుకూ, గోదానానికీ సంబంధం, ఏమిటమ్మా?" అన్నాడు చలమయ్య.

అంత జబ్బులోనూ, ఒక అవును వదులుకోవడం అన్నమాట, ఆయనకు దిగులు పుట్టించింది.

"ఒరే, మనం చేసిన పాపాలే జబ్బుల రూపంలో మనను బాధిస్తాయి. అంటే— జబ్బు మనను పుణ్యకార్యాలేమైనా చేయమని హెచ్చరిస్తుందన్న మాట! నీ సంగతి నాకు తెలియనిదేముంది? డబ్బు కూడ బెట్టడమే తప్ప, ఎవరికీ సాయపడి ఎరుగవు. అంతా, నీ నాయన పోలిక," అన్నది శాంతమ్మ.

చలమయ్య భార్యా పిల్లలు కూడా, ఆయనను తల్లి చెప్పినట్టే చేయమని బలవంతపెట్టారు.

చివరకు చలమయ్య, రామశర్మ అనే బ్రాహ్మణుణ్ణి పిలిపించి, ఒక చూడి అవును దానం చేసి, "బ్రాహ్మణోత్తమా! అవు ఈనగానే, దాన్ని మీరు వుంచుకుని, దూడను నాకు ఇవ్వాలి. దూడతో, మీకేం పని వుండదు గదా," అన్నాడు.

రామశర్మ కంగారుపడి, "అయ్యా, తల్లినీ, బిడ్డనూ వేరు చేయడం, మహా పాపంగదా!" అన్నాడు.

"గోన్యాయం వేరు; మానవన్యాయం వేరు. మీరనే న్యాయం, మానవులకేగాని,

"వసుంధర"



కాబట్టి, దాన్ని చూడాలన్నవంకతో, రోజు కొకసారైనా, అయన రామశర్మ ఇంటికి వెళ్ళి, అవును చూసుకుంటూండేవాడు.

ఈ విధంగా వారం రోజులు గడిచినై. ఒకరోజున చలమయ్య ఉండబట్టలేక, రామశర్మను, "బ్రాహ్మణోత్తమా! అవు, పాలు సక్రమంగా ఇస్తున్నదా?" అని అడిగాడు.

"అయ్యా, ఇది దేవతాంశగల అవు. రోజుకు నాలుగుశేర్ల పాలిస్తున్నది," అని చెప్పాడు రామశర్మ.

స్వతహాగా రామశర్మ మొహమాటస్థుడు. అయన, చలమయ్యను సంతోషపెట్టాలనుకుని, అవు ఇస్తున్నదానికి రెండు శేర్లు ఎక్కువ చెప్పాడు.

ఇది వింటూనే చలమయ్యకు గుండె ఆగినట్టయింది. తనకున్న అవుల్లో, ఏ ఒకటీ అన్ని పాలివ్వదు.

"బ్రాహ్మణోత్తమా! అవు అంత ఎక్కువగా పాలిస్తున్నదంటే, అవి ఏమంత రుచిగా వుండవనుకుంటాను," అన్నాడు చలమయ్య.

రామశర్మ పాలు రుచిగా లేదంటే, చలమయ్యకు కొంత తృప్తిగా వుండేది. అలాకానప్పుడు, చాలా మంచి అవును, దానం పేరుతో పోగొట్టుకున్నానన్న బాధ చలమయ్యను వదలదు.

పశువులకు వర్తించదు. అయినా, దూడను మీరు వెంటనే, నాకివ్వనవసరంలేదు. దానికి తల్లి అవసరం తీరాకనే," అని చెప్పాడు చలమయ్య.

రామశర్మ సరేనని, అవును తోలుకు పోయాడు. ఆ మర్నాటికి చలమయ్య జబ్బు చేత్తో తీసినట్టు మాయమైపోయింది. కొద్ది రోజుల తర్వాత, చలమయ్య ఎప్పటి మనిషై పోయాడు.

కొన్నాళ్ళకు చలమయ్య దానం చేసిన అవు ఈనింది. దానికొక కోడె దూడ పుట్టింది. ఈ సంగతి తెలిసినప్పటినుంచీ, చలమయ్య మనసు, మనసులో లేదు. అవు తనది కాకపోయినా, దూడ తనదే

కాని, రామశర్మ ఎంతో కృతజ్ఞతగా, ''అయ్యా, మంచిమనసుతో, మీరిచ్చిన, ఈ ఆవు పాల రుచి, మాటల్లో వర్ణించ లేను. బహుశా, దేవతలు సేవించే అమృతం, అలాగే వుంటుందేమో!'' అన్నాడు.

చలమయ్య వెంటనే, ''అలాగైతే, ఈ ఆవు పాల రుచి చూడాలని, నాకు కోరికగా వున్నది,'' అన్నాడు.

రామశర్మ, అప్పటికప్పుడాయనకు, ఒక లోటాలో వేడి పాలు తెప్పించి యిచ్చాడు. చలమయ్య, ఆ పాలు తాగాడు. చాలా బాగున్నవి.



చలమయ్య దిగులుతో ఇంటికి వెళ్ళి పోయాడు. ఆ రాత్రంతా ఆయనకు నిద్ర పట్టలేదు.

మర్నాటి ఉదయం నిద్రలేస్తూనే, ఆయన రామశర్మకు కబురుపెట్టి, ''బ్రాహ్మణోత్తమా! నేనొకరకమైన అనా రోగ్యంతో బాధపడుతున్నాను. నిన్న మీ ఇంట ఆవుపాలు తాగగానే, ఎంతో గుణం కనబడింది. నిజంగానే, ఆ ఆవులో, దేవ తాంశ వున్నదనిపిస్తున్నది. ఆ పాలలో అమృతం వున్న లక్షణాలు కనిపిస్తున్నవి. మీరది ప్రతి దినమూ నాలుగు శేర్ల పాలిస్తున్నదన్నారు కాబట్టి, అందులో రెండు శేర్ల పాలు, నా కివ్వ గోర్తాను. నా ఆరోగ్యం బాగయేవరకు మాత్రమే, ఇలా యివ్వండి!'' అని చెప్పాడు.

ఇది విని రామశర్మ గుండెల్లో రాయి పడినట్టయింది. కాని, ఆయన ఏమీ అన లేక, చలమయ్యతో సరేనని చెప్పి, ఇంటికి వెళ్ళిపోయాడు.

శాంతమ్మ కొడుకును మందలిస్తూ, ''గోవును దానం చేసి, దాని పాలు తీసు కుంటే, పుణ్యం దక్కదురా!'' అన్నది.

''పుణ్యం దక్కకపోతే, నా జబ్బు తిరిగి రావాలి గదా? అలా జరగలేదు కాబట్టి, నన్నేపాపమూ అంటలేదు; వచ్చిన పుణ్యం పోనూలేదు,'' అన్నాడు చలమయ్య.



దుకు తగ్గడం లేదు— అని మధనపడ్డాడు చలమయ్య.

ఒకనాడు చలమయ్య ఇంటి ముందు, సాధువొకడు నిలబడి, "ఇంట్లో పాప ముంది! నివారించుకోండి," అని కేక పెట్టాడు.

ఇది విని, శాంతమ్మ సాధువును లోపలకు పిలిచి, కొడుకును చూపించింది.

సాధువు, చలమయ్యను పరీక్షగా చూసి, "నీకు గోదానం చేసిన పుణ్యం రాలేదు. పైగా, పాలు దొంగతనం చేసిన పాపం చుట్టుకున్నది!" అన్నాడు.

చలమయ్య దీనంగా, "స్వామీ, అలా ఎందుకు జరిగింది? ఇందులో వున్న రహస్యం ఏమిటి? నేను దానం చేసిన ఆవు యిచ్చే పాలతో, సద్బ్రాహ్మణుడైన రామశర్మ సుఖిస్తున్నాడు గదా!" అన్నాడు.

అందుకు సాధువు, "ఓయీ, నీవంటి డబ్బుకాపీన జీవులకు, నిదర్శనాలు, ఆ భగవంతుడే చూపుతూంటాడు. గోదానం చేసిన పుణ్యం తక్షణమే సంజీవనిలా పని చేసి, నీ జబ్బు తగ్గిపోయింది. ఈ నిదర్శనం కారణంగా— నీవు బుద్ధిగలవాడివైతే, దానం చేయడం వల్ల పుణ్యం వస్తుందన్న నమ్మకం కలగాలి. కాని, అలా జరగలేదు. జబ్బు తగ్గగానే, వంచనాబుద్ధితో, ఆవుపాలను రామశర్మ నుంచి హరించడం

ఆ రోజు నుంచీ రామశర్మ, ఆవును తాను పోషిస్తూ, అది యిచ్చిన పాలన్నీ చలమయ్యకు పంపిస్తూ వచ్చాడు.

ఇలా కొంతకాలం జరిగేసరికి, చలమయ్యకు మళ్ళీ జబ్బు తిరగబెట్టింది. ఆయన హడలిపోయి, వెంటనే రామశర్మ దగ్గిర్నుంచి, పాలు తీసుకోవడం మానేశాడు. అయినప్పటికీ, ఆయన జబ్బు తగ్గలేదు. వైద్యుడు వచ్చి మందిస్తున్నాడు. కాని, ఆ మందు ఏమాత్రం పని చేయడం లేదు.

రామశర్మ నుంచి పాలు తీసుకోవడం మానేశాను కాబట్టి, నాకు గోదానం చేసిన పుణ్యం దక్కాలి. అయినా, నా జబ్బెం

మొదలుపెట్టావు. జబ్బు తిరగబెట్టింది. ఇది తగ్గితే, మళ్ళీ పాలడుగుతావని రామశర్మ భయపడుతున్నాడు. ఆ సద్బ్రాహ్మణుడి భయమే, నీకు జబ్బు తగ్గకుండా చేస్తున్నది!'' అని చెప్పాడు.

''అయితే, యిప్పుడు నేనేం చెయ్యాలి, స్వామీ!'' అని అడిగాడు చలమయ్య విలవిల్లాడిపోతూ.

''పాల దొంగతనం మహాపాపం! ఆ పాపం నిన్నంటింది. దాని నుంచి విముక్తుడివి కావడానికి, నువ్వు మరొక గోదానం చెయ్యాలి—అదీ ఒక పుణ్యాత్ముడికి!'' అన్నాడు సాధువు.

''అలాగే. ఆ గోదానమేదో, మీకే చేస్తాను,'' అన్నాడు చలమయ్య.

''నేనెవరికీ దానధర్మాలు చేయలేదు. అందువల్ల, నేను పుణ్యాత్ముణ్ణనిపించుకోను,'' అన్నాడు సాధువు.

''అలా అయితే, ఆ పుణ్యాత్ముడెవరో, తమరే సెలవివ్వండి, స్వామీ!'' అన్నాడు చలమయ్య.

''ఈ గ్రామంలో, ఇప్పుడందరిలోకీ, రామశర్మ పుణ్యాత్ముడు. ఆయనకు పాలను దానం చేసిన పుణ్యం వచ్చింది!'' అన్నాడు సాధువు.

ఇది విని, చలమయ్య తెల్లబోయాడు.

సాధువు నవ్వి, ''నువ్వు గోదానం చేసినప్పుడు, ఆ దానం పట్టినవాడు పాలెవరికైనా దానం చేస్తే—ఆ పుణ్యం కూడా, నీకే దక్కేది. కాని, రామశర్మ, నీకు పాలివ్వడం వల్ల, నీకు పాల దొంగతనం పాపం; ఆయనకు దానం చేసిన పుణ్యం దక్కాయి. ఇంత చేదు అనుభవం తరవాతనైనా, నీ డబ్బుకాపీనం వదిలిపెట్టు!'' అని సలహా యిచ్చాడు.

చలమయ్య, సాధువు చెప్పినట్టే చేసి—సంతానంతో సహా, రెండావులూ రామశర్మకేనని హామీ యిచ్చి, తన తప్పు క్షమించమన్నాడు.

ఆ తర్వాత చలమయ్య జబ్బు తగ్గిపోయింది. ఆయన మనస్ఫూర్తిగా దానధర్మాలు చేస్తూ, సుఖంగా జీవించాడు.





# కొత్తఆశ్వికుడు

జయసాగర్ రాజయిన రత్నదేవుడు గొప్ప అశ్వప్రియుడు. ఆయన అశ్వశాలలో, పర్షియా, అరబ్బీజాతి గుర్రాలే కాక, ఎక్కడో బర్మా, సయాం, సింహళ దేశాల నుంచి తెప్పించిన విలువైన గుర్రాలెన్నో వుండేవి.

ఆయన వద్ద ఇలాంటి జాతిగుర్రాలతో పాటు, అశ్వశిక్షణలో ఆరితేరినవాళ్ళూ, స్వారీచేయడంలో నిపుణులైనవాళ్ళూ ఎందరో వుండేవాళ్ళు. అయినా, రాజు పొరుగుదేశాల్లో అలాంటి వాళ్ళు మరి కొందరున్నారని విన్నప్పుడు, వాళ్ళకు పెద్ద, పెద్ద జీతాల ఆశచూపి, తన దేశానికి రప్పించుకునేవాడు. తన దేశం వాళ్లంటే, ఆయనకు చిన్నచూపు.

ఒకనాడు, రత్నదేవుడి దగ్గిరకు చారుడొకడు వచ్చి, ''మహారాజా, ఇంతకు ముందే నేనొక గుర్రపురౌతుతో మాట్లాడాను. అతను వైశాలీరాజు దగ్గిరకు పోతున్నాడు. రెండు పగళ్ళూ, రెండు రాత్రులూ ఏకధాటిన గుర్రపుస్వారీ చేయగలడు. అతను వైశాలీరాజధాని చేరే ముందు, దారిలో వున్న విష్ణుపురాన ఒక వారం రోజులపాటు వుంటాడు. అక్కడ, అతడి మిత్రుడి వివాహం జరగబోతున్నది.'' అని చెప్పాడు.

ఆ మాట వింటూనే రత్నదేవుడు ఉత్తేజితుడైపోతూ, ''ఆఁ, ఎన్నాళ్ళకెన్నాళ్ళకు, మనక్కావలసిన ఆశ్వికుడు దొరికాడు! రెండు పగళ్లూ, రెండు రాత్రులూ ఏకధాటిన గుర్రపుస్వారీ చేయగల సమర్థుడు, నా కొలువులో వున్నాడన్న కీర్తి, దేశదేశాలా మార్మోగిపోతుంది!'' అన్నాడు.

తర్వాత ఆయన అప్పటికప్పుడు మంత్రిని పిలిచి, ''మీరు వెంటనే వైశాలీ

రావులపాటి ప్రసాద్

దేశంలో వున్న విష్ణుపురానికి, మన అశ్వికుణ్ణొకణ్ణి పంపండి. అ వెళ్ళినవాడు, నగరంలో వున్న మహాశ్వికుణ్ణి కలుసుకుని, మన జయసాగర్ కు తీసుకు రావాలి,'' అని చెప్పాడు.

మంత్రి, రాజుకు ఏదో చెప్పబోయాడు. కాని, రాజు విసుగుపడుతూ, ''ఇది కాలం వృథాపుచ్చవలసిన సమయం కాదు! తక్షణం అశ్వికు డొకణ్ణి విష్ణుపురం పంపండి. వాడు అక్కడున్న అశ్వికుణ్ణి కలుసుకుని, తానే రాజుగారి దగ్గిర నుంచి వచ్చిందీ తెలపమనండి. తర్వాత, ఆ అశ్వికుడికి నెలకు నూరు బంగారు కాసుల జీతం ఇవ్వదలచినట్టు చెప్పమనండి. ఇది నా అజ్ఞ!'' అన్నాడు.

మంత్రి, ఇక రాజుకు ఏమి చెప్పి ప్రయోజనం లేదనుకుని, అయన అజ్ఞాపించినట్టు, ఒక అశ్వికుడికి సంగతి సందర్భాలు వివరించి, విష్ణుపురానికి పంపాడు.

ఇది జరిగిన ఏడవ రోజున, విష్ణుపురం నుంచి కొత్త అశ్వికుడు రత్నదేవుడి దగ్గిరకు వచ్చి, అయన ఇస్తానన్న జీతానికి ఒప్పుకున్నాడు. ఒక గొప్ప అశ్వికుడు, వైశాలీ రాజుకొలువులో కాక, తన కొలువులో చేరినందుకు, రత్నదేవుడికి చాలా అనందం కలిగింది.

కొత్త అశ్వికుడు, కొంతసేపు ఊరుకుని, రత్నదేవుడితో, ''మహారాజా, వైశాలీ రాజుగారు, నన్ను తన కొలువులో చేరవల



సిందిగా కోరుతూ, దూతను పంపాడు. కాని, ఈలోపలే తమరు పంపిన మనిషి నన్ను కలుసుకోవడం జరిగింది. ఆ కారణంవల్ల, ఆ రాజు పంపిన దూతను తిప్పిపంపి, తమ కొలువులో చేరాను,'' అన్నాడు వినయంగా.

ఇది విని రత్నదేవుడు మరింత ఆనందం చెంది, మంత్రితో, ''మహా మంత్రీ, మనం విష్ణుపురం పంపిన అశ్వికుడికి, ఏదైనా మంచి బహుమానం ఇవ్వండి,'' అన్నాడు.

అందుకు మంత్రి, ''మహారాజా, మనం విష్ణుపురం పంపిన అశ్వికుడు—త్వరగా ఆ నగరం చేరేందుకు, మూడు పగళ్ళూ, మూడు రాత్రులూ ఏకధాటిన గుర్రాన్ని పరిగెత్తించాడు. ఈ సంగతి విన్న వైశాలీ రాజు, మన అశ్వికుడి నైపుణ్యానికి అమితానందంచెంది, అతడికి మనం ఇచ్చేదానికన్న ఎక్కువ జీతం మీద, తన కొలువులో ఉద్యోగం ఇచ్చాడు. ఈ వార్త ఇంతకుముందే, నాకు చేరింది. తమకు మనవి చేద్దామనుకుంటున్నాను,'' అని జవాబిచ్చాడు.

ఆ జవాబు విని, రత్నదేవుడు ఆశ్చర్యపోతూ, ''మన దేశ పౌరులైనవాళ్ళే, కొలువులో కొందరు గొప్ప అశ్వికులున్నారన్న మాట! ఇంతకాలంగా, ఆ సంగతి గుర్తించక, పొరుగుదేశం వాళ్ళకు పెద్ద జీతాలతో ఉద్యోగాలిస్తున్నాం,'' అన్నాడు.

''నా అభిప్రాయం కూడా, అదే, మహారాజా!'' అన్నాడు మంత్రి.

''అయితే, ఒక పని చెయ్యడం బావుంటుంది. ఇప్పుడు మనవద్ద వున్న అశ్వికుల మధ్య పోటీలు ఏర్పాటు చేద్దాం. అందులో అత్యంత నిపుణులని తేలినవాళ్ళకు, తగిన బహుమతులిచ్చి ప్రోత్సహిద్దాం,'' అన్నాడు రత్నదేవుడు.

ఆ విధంగా జరిగిన పోటీలలో, జయసాగర్ అశ్వికులు, పొరుగుదేశపు అశ్వికులకు సమ ఉజ్జీలేకాక, కొన్ని అంశాలలో వాళ్ళకన్న ఎంతో అధికులని బయటపడింది.






## 6

[చిత్రసేనుడు తన అనుచరులతో కోటకు వెళుతూండగా, ఉగ్రాక్షుడు పంపగా వచ్చిన రాక్షసులు, అతణ్ణి తిరిగి తమ నాయకుడి వద్దకు పిలుచుకుపోయారు. అక్కడ చిత్ర సేనుడికి అమరపాలు అనేవాడు కనిపించాడు. వాడు జ్వాలాద్వీపవాసులను గురించిన కొన్ని రహస్యాలు చెప్పి, హఠాత్తుగా మూగిలా ఆకాశంకేసి తల ఎత్తాడు. తరవాత—]

అమరపాలుడి ఈ విచిత్ర ప్రవర్తన చిత్ర సేనుడికి చాలా ఆశ్చర్యం కలిగించింది. ఉగ్రాక్షుడు కోపంతో నిలువెల్లా కంపించి పోతూ, చేత గల రాతిగదను పైకెత్తి ఝుళిపిస్తూ, "ఏమిరా, నీకేమైనా హఠాత్తుగా బుర్రతిరుగుడు వ్యాధి పుట్టు కొచ్చిందా? ఈ గదతో ఒక్కటి మోది, ఇప్పుడే దాన్ని సరిచెయ్యమంటావా?" అంటూ గర్జించాడు.

అమరపాలుడు భయపడలేదు. అతడు చిరునవ్వుతో ఉగ్రాక్షుడి కేసి చూస్తూ, "నా చావు తరవాత, నీ చావుకు ఎంతో కాలం పట్టదు. కపిలపురాన్ని ఆక్ర మించుకున్న నాగవర్మ సంగతి నీకు తెలుసుగదా? అతడికి సహాయం చేస్తున్న జ్వాలాద్వీపవాసులూ, భయంకరపక్షులూ, నీ దేహం మీద వదిలిపోయిన గుర్తుల విషయం మరిచిపోకు," అన్నాడు.



అమరపాలుడు తన గాయాలకు కట్టి వున్న కట్ల విషయమై హేళన చేస్తున్నాడని ఉగ్రాక్షుడు గ్రహించి, భయంకరంగా హుంకరిస్తూ, రాతిగదతో అతడి తల పగలగొట్టేందుకు ముందుకు అడుగు వేశాడు. కాని, అంతలో చిత్రసేనుడు రాక్షసుడికీ, అమరపాలుడికీ మధ్యగా వెళ్లి నిలబడి, "ఆగు, ఉగ్రాక్షా!" అన్నాడు ఆజ్ఞాపిస్తున్నట్టు.

"వీడు....వీడు, ఈ మానవాధముడు నన్ను ఇంత హేళనగా మాట్టాడతాడా!" అంటూ ఉగ్రాక్షుడు కోరలు చాచాడు.

"మానవులంటే అంత చులకనగా ఎప్పుడూ మాట్లాడకు. ఇతడు మనకు తప్పక సహాయం చేస్తాడని నా నమ్మకం. ఒకవేళ అలా కానప్పుడు, నీ ఇష్టం వచ్చినట్టుగా ఇతణ్ణి హింసించవచ్చు." అన్నాడు చిత్రసేనుడు.

చిత్రసేనుడు ఇలా అనగానే అమరపాలుడు నిలువెల్లా వణికిపోతూ, "మహారాజా, ఇది అన్యాయం. మీరు నాకు ప్రాణదానం చేస్తామని వాగ్దానం చేశారు. ఆ మాట నమ్మి నేను చెట్టు దిగి వచ్చాను. లేకపోతే ఈ రాక్షసుల చేతుల్లో పడకుండా, అక్కడే ఆత్మహత్య చేసుకుని వుండేవాణ్ణి!" అన్నాడు.

"నీకు ప్రాణాపాయం కలగదని, నేను వాగ్దానం చేసిన మాట నిజమే. కాని, నువ్వు అది అవకాశంగా తీసుకుని, నా ప్రశ్నలకు ప్రత్యుత్తరం ఇవ్వకుండా, ఆకాశంకేసి గుడ్లు మిటకరించే వెర్రి మొర్రి వేషాలు వేస్తున్నావు. ఇలాంటి పరిస్థితుల్లో, నా వాగ్దానం నిలుపుకోవలసిన అవసరం లేదు." అన్నాడు చిత్రసేనుడు కఠినంగా.

"క్షమించండి, మహారాజా! నేను ఈ క్షణం నుంచి మీ సేవకుణ్ణి. రాజద్రోహి అయిన నాగవర్మ మీద నా కెలాంటి గౌరవం లేదు. క్రూరమృగాల్లాంటి జ్వాలా ద్వీపవాసులంటే నాకు మొదటి నుంచీ ద్వేషమే. కాని, నాగవర్మకు వెరిచి, నేను



వాళ్ళల్లో చేరాను,'' అన్నాడు అమర పాలుడు దీనంగా.

''అలా అయితే, దాచకుండా నీకు తెలిసినదంతా చెప్పు. ధవళగిరి మీద దాడికి వెళ్ళిన నాగవర్మ సైన్యాలవెంట భయంకర పక్షులెక్కిన జ్వాలాద్వీపవాసు లెవరైనా వున్నారా?'' అని అడిగాడు చిత్రసేనుడు.

''ఉండినా వుండొచ్చు. కపిలపురానికి అనుకుని వున్న అడవిలో దాదాపు నూరు భయంకరపక్షులు రౌతులతోపాటు స్థావ రాలు ఏర్పరుచుకున్నవి. జ్వాలాద్వీప వాసులకు బానిసలుగా నాగవర్మ తన ప్రజల్లో కొందరిని ఇచ్చాడు. దానిగ్గాను వాళ్ళు అతడికి, ఈ సహాయం చేస్తు న్నారు,'' అన్నాడు అమరపాలుడు.

''ఈ భయంకర పక్షుల్ని చంపేందుకు సులువైన మార్గం ఏమైనా వుందా?'' అని అడిగాడు, ఉగ్రాక్షుడు తన గాయాలకు కట్టివున్న కట్లను సర్దుకుంటూ.

''లేకేం, వున్నది. వాటి ముక్కులకూ, గోళ్ళకూ చిక్కకుండా తప్పుకోగలిగితే, వాటి మెడను ఒక చిన్న కత్తివేటుతో తునాతునియలుగా నరికి వెయ్యవచ్చును. మెడ విషయంలో వాటికీ ఇతర పక్షు లకూ తేడా ఏమీ లేదు,'' అన్నాడు అమర పాలుడు.

''హ్హహ్హ!'' అంటూ ఉగ్రాక్షుడు పెద్దగా నవ్వి, ''ఈసారి ఆ దుర్మార్గులు తటస్థ పడితే, నా ప్రతాపం చూపుతాను!'' అంటూ జబ్బలు చరచసాగాడు. అంతలో కొందరు రాక్షసులూ, ప్రజలూ గగ్గోలు పెడుతూ, ''మహానాయకా! మహారాజా!'' అంటూ అక్కడికి పరిగెత్తి రాసాగారు.

ప్రాణభీతితో హాహాకారాలు చేస్తూ, తమను సమీపిస్తున్న ప్రజలనూ, రాక్షసు లనూ చూస్తూనే, చిత్రసేనుడు మరేదో పెద్ద ప్రమాదం ముంచుకువచ్చిందని ఊహించాడు.

''మహారాజా! జడలమర్రి దగ్గిర పశువుల్ని మేపుకుంటున్న మా మీద,



భయంకర పక్షులూ, పులిరాయుళ్ళూ వచ్చిపడ్డారు. వాళ్ళు పశువుల్నీ, మనుషుల్నీ ఎత్తుకుపోతున్నారు. మేము కొద్దిమందిమి మాత్రం పారిపోయి వచ్చాం,'' అంటూ గగ్గోలుగా అరిచారు ప్రజలు.

ఉగ్రాక్షుడి దగ్గిరకు పరిగెత్తిపోయిన రాక్షసులు కూడా, తమ నాయకుడితో ఇలాగే మొరపెట్టుకున్నారు. కాని, వాళ్ళు పశువుల్ని మేపేందుకు వెళ్ళిన రాక్షసులు కాదు. దొంగతనంగా వాటిని ఎత్తుకుపోయేందుకు వెళ్ళినవాళ్ళు. పులిరాయుళ్ళు అదే సమయానికి అక్కడికి రావటంతో, వాళ్ళ చేతుల్లో వీళ్ళు చావుదెబ్బలు తిన్నారు.

''చిత్రసేనా! మనం పశువుల కాపర్లకు రక్షణగా వెళదామంటావా?'' అని అడిగాడు ఉగ్రాక్షుడు నిరుత్సాహంగా.

''వెళ్ళక చేసేదేమిటి? ప్రజలను ఆ దుర్మార్గులు హింసిస్తూ వుంటే, చూస్తూ వూరుకుంటామా?" అన్నాడు చిత్రసేనుడు.

ఆ వెంటనే చిత్రసేనుడు జడలమర్రి ప్రాంతానికి బయలుదేరాడు. ఉగ్రాక్షుడు ముఖంలో లేని గాంభీర్యాన్ని కనబరుస్తూ, ''ఊఁ పదండి! ఆ క్రూరుల్ని చిత్రవధ చేస్తాను,'' అంటూ అతడి వెనకగా నడిచాడు.

అందరూ కొంతదూరం చెట్లలో నడిచిన తరవాత, అమరపాలుడు ముందుకు వచ్చి, చిత్రసేనుడితో, ''మహారాజా, నాదొక మనవి! ఈసరికే పులిరాయుళ్ళు తమ పని ముగించుకుని వెళ్ళిపోయి వుంటారు. అలా కాక, వాళ్ళింకా అక్కడ వున్నప్పటికీ, మనం వాళ్ళను ఏమీ చేయలేం. ఆ భయంకరపక్షులు వెంట వుండగా, వాళ్ళను ఎదుర్కొనటం ఆత్మహత్యతో సమం అవుతుంది,'' అన్నాడు.

ఉగ్రాక్షుడు ఇందుకు అవునన్నట్టు తల ఊపుతూ, ''చిత్రసేనా, ఈ అమరపాలుడు చెప్పేదాంట్లో నిజం వున్నది. మనం తొందరపడకూడదు. రాత్రి జరిగిన అనుభవం గుర్తుంది కదా!'' అన్నాడు.

వాళ్లిద్దరూ అలా చెప్పిన తరవాత చిత్ర సేనుడి కూడా, తను చేయబోతున్నది కేవలం దుస్సాహసమన్న అనుమానం కలిగింది. అనవసరంగా తన అనుచరులూ, కొందరు రాక్షసులూ ప్రాణాలు వదలటం తప్ప, జ్వాలాద్వీపవాసులతో పోరుపెట్టుకుని తను చేయగలిగిందేమీ లేదని అతడు గ్రహించాడు. అయితే, తను రాజయివుండీ, తన పౌరులకు రక్షణ కలిగించలేని నిస్సహాయ స్థితిలో ఇంకెంత కాలం రాజ్యపరిపాలన చెయ్యగలడు? తన తండ్రిగారి రాజ్యం మీద దాడి వెడలిన నాగవర్మ, అక్కడ విజయం సాధించగానే, తన నగరం మీద వచ్చి పడకుండా వూరుకుంటాడా?

ఇలాంటి సంశయాలతో, భయాలతో చిత్రసేనుడు సతమతమవుతూండగా, అమరపాలుడు, "మహారాజా! నేను మీకు నమ్మిన సేవకుణ్ణి. దూకమంటే అగ్నిలో అయినా దూకుతాను. కనుక, నా మాట నమ్మండి. మనం ముందుగా కపిలపురం అడవిలో స్థావరాలు ఏర్పరుచుకున్న భయంకర పక్షుల్ని కపటోపాయం ప్రయోగించి సర్వనాశనం చేయాలి. అప్పుడు, ఈ పులిరాయుళ్ళను హతమార్చటం ఏమంత కష్టం కాదు," అన్నాడు.



"అక్కడ దాదాపు నూరు భయంకర పక్షులున్న వంటున్నావ్! వాటిని మనం ఎలా చంపగలం?" అన్నాడు చిత్రసేనుడు.

"ఆ పక్షుల్ని చంపేందుకు ఒక సులువైన ఉపాయం వుంది మహారాజా!" అన్నాడు అమరపాలుడు.

"ఏమిటది?" అన్నాడు చిత్రసేనుడు.

ఈ సంభాషణ శ్రద్ధగా ఆలకిస్తున్న ఉగ్రాక్షుడి కూడా, ఆ ఉపాయం ఏమిటో వినాలన్న కుతూహలం కలిగి, "ఏమిటా ఉపాయం అమరపాలా?" అన్నాడు ఎంతో ఆతృతగా.

అమరపాలుడు కోపంగా ఉగ్రాక్షుడి కేసి చూసి, చిత్రసేనుడితో, "మహారాజా!



కపిలపురం దగ్గిర వున్న అడవిలో, భయంకరపక్షులు కొన్ని వున్నవని చెప్పానుగదా. అవి పెద్ద పెద్ద కొట్టాలలో, కాళ్ళకు బలమైన గొలుసులతో బంధించబడి, కట్టుకొయ్యలకు కట్టివేయబడి వుంటవి. వాటిని సవారీకి ఉపయోగించే రౌతులు ఆదగ్గిరలో వున్న గుడిసెలలో వుంటారు. ఆ పక్షులను కొట్టాలలో వుండగానే మనం చంపివేయాలి," అన్నాడు.

"బాగానే వుంది. కాని, చంపటం ఎలా అన్నదే సమస్య!" అన్నాడు చిత్రసేనుడు నిరుత్సాహంగా.

"మహారాజా! ఇందుకు ఒక ఉపాయం నేను ఆలోచించి వుంచాను. వాటిని...."

అంటూ అమరపాలుడు చిత్రసేనుడితో మెల్లిగా ఏమో చెప్పబోయేంతలో, ఎదురుగా వున్న చెట్ల చాటు నుంచి పెద్ద కోలాహలం వినబడింది. చిత్రసేనుడూ, ఉగ్రాక్షుడూ—వాళ్ళ అనుచరులూ అటుకేసి పరిగెత్తారు. వాళ్ళు చెట్ల గుంపును చేరి, ముందుకు చూసేసరికి, ఒకానొక బీభత్స దృశ్యం వాళ్ళ కంటబడింది.

కొన్ని భయంకర పక్షులు, గొర్రెలనూ, ఆవులనూ గోళ్ళతో పట్టుకుని, కోడిపిల్లలను తన్నుకుపోయే గద్దలలాగా ఆకాశంలోకి లేస్తున్నవి. పులిచర్మాలు ధరించిన వాళ్ళు వాటి రెక్కల మీద వుండి పెద్దగా కేకలు పెడుతూ, పారిపోతున్న పశుల కాపరుల మీదికి శూలాలను విసిరివేస్తున్నారు. ఒక్కొక్క పులిచర్మంగాడి దగ్గిరా ఒక మోపెడు శూలాలు వున్నవి. పశుల కాపర్లలో తెగించిన వాళ్ళు కొందరు నిలబడి, వడిసెలలతో వాళ్ళ మీదికి రాళ్ళు విసురుతున్నారు. పశువులు అన్ని వైపులకూ చెల్లాచెదరుగా పారిపోతున్నవి.

ఈ భయంకర దృశ్యం చూసి చిత్రసేనుడు నిలువెల్లా కంపించిపోయాడు. ఉగ్రాక్షుడు క్రోధంతో ఒక్కసారి ఒళ్ళు విదిలించుకుని, రాతి గదను బలంగా భూమికి తాటించి, గర్జించబోయేంతలో, చిత్రసేనుడు అతణ్ణి వారిస్తూ, "అంతా

అయిపోయిన తరవాత, ఇప్పుడు మళ్ళీ ఆ క్రూరులు మన మీద వచ్చిపడేలా నువ్వు అరిచి లాభం లేదు. మనం ఇప్పుడు చేయగలిగిందల్లా, గాయపడిన పశులకాపర్లకు కట్లుకట్టి ఇళ్ళకు చేర్చటమే,'' అన్నాడు.

చిత్రసేనుడు ఇలా అనగానే, అతడి అనుచరులూ, కొందరు రాక్షసులూ ముందుకు వెళ్ళబోయారు. కాని, చిత్రసేనుడు వాళ్ళను ఆపి, ''ముందు ఆ దుర్మార్గుల్ని ఇక్కణ్ణించి వెళ్ళిపోనీయండి,'' అన్నాడు.

చూస్తూండగానే జ్వాలాద్వీప వాసులు తమ వాహనాల మీద ఆకాశంలోకి ఎగిరిపోయారు. వాళ్ళు దూరంగా కనబడకుండా పోయినంతవరకూ ఆగి, తరవాత రాక్షసులూ, చిత్రసేనుడి అనుచరులూ గాయపడ్డవాళ్ళకు కట్లు కట్టసాగారు. ఉగ్రాక్షుడు నీరసంగా ఒక చెట్టు బోదెకు చేరగిలపడి, ''చిత్రసేనా! నాకు ఏనాడూ లేనిది ఎందుకనో కాస్త భీతి కలుగుతున్నది. మన రాజ్యానికి ఈ మహమ్మారిగాళ్ళ పీడ విరగడ అయే మార్గమేదో ఆలోచించాలి,'' అన్నాడు.

చిత్రసేనుడు, అమరపాలుడి కేసి తిరిగి, ''అమరపాలా! జ్వాలాద్వీప వాసుల్నీ, వాళ్ల భయంకరపక్షుల్నీ నాశనం చేసేందుకు ఏదో ఉపాయం వున్నదన్నావు. ఏమిటది?'' అని అడిగాడు.

''ఆ భయంకర పక్షుల్ని, అవి కట్టివేయబడి వుండే కొట్టాల్లోనే నాశనం చేయాలి. అందుకు ఒకటే మార్గం, అవి వుండే కొట్టాలకు నిప్పు పెట్టటమే,'' అన్నాడు అమరపాలుడు.

''అది సాధ్యం అయే పనేనా?'' అని అడిగాడు చిత్రసేనుడు.

''ఎందుకు సాధ్యం కాదు మహారాజా! నా వెంట నలుగురైదుగురు సైనికుల్ని పంపండి. నేను కపిలపురం అడవుల్లోకి వెళ్ళి, కావలిగాళ్ళను హతమార్చి, ఆ పక్షుల్ని నిలువునా దహించేస్తాను,' అన్నాడు. అమరపాలుడు. —(ఇంకావుంది)






# వాగ్దానభంగం

పట్టువదలని విక్రమార్కుడు చెట్టువద్దకు తిరిగి వెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, ఇంత అర్ధరాత్రివేళ, ఒంటరిగా నువ్వీ శ్మశానంలో పడుతున్నశ్రమ చూస్తూంటే, నువ్వేదో ఒక మహత్తర కార్యాన్ని సాధించ దలచినట్టు కనబడుతున్నది. కాని, నీ పట్టుదల, ఆ కార్యం సఫలమయ్యేవరకూ ఇలాగే వుంటుందా, అన్న సంశయం నాకు కలుగుతున్నది. లోకంలో ఏది సాధించాలన్నా, మనిషికి బుద్ధినిలకడా, నీతి వర్తనా, ఇచ్చిన మాటను నిలబెట్టు కునే నిజాయితీల్లాంటివి ఎంతో అవసరం. అవి లేనినాడు, ఏవో కుంటిసాకులతో మధ్యలోనే తిరోగమించవలసి వస్తుంది. ఇందుకు ఉదాహరణగా నీకు, విజయపుర

## బేతాళ కథలు



రాకుమారి కథ చెబుతాను, శ్రమతెలియ కుండా విను,'' అంటూ ఇలా చెప్ప సాగాడు:

ఒకనాటి సాయంకాలం వేళ, విజయ పుర రాకుమారి సువర్ణ మేనాలో, తన మేనమామల ఇంటి నుంచి, రాజధానికి తిరిగి వస్తున్నది. మేనాను నలుగురు దృఢకాయులైన బోయీలు మోస్తున్నారు. కొందరు చెలికత్తెలూ, అంగరక్షకులూ, ఇరుపక్కలా, ముందు వెనుకలా నడుస్తున్నారు.

రాజధాని ఇంకా రెండామడల దూరం వున్నదనగా వాళ్ళు ఒక కొండ లోయలో ప్రవేశించారు. లోయకు ఇరువైపులా ఎత్తయిన బండరాళ్ళున్నవి. ఉన్నట్టుండి హఠాత్తుగా, ఆ రాళ్ళ వెనక నుంచి భీకర మైన కేకలు వినిపించినై. రాకుమారి అంగరక్షకులు, అటు కేసి చూసేంతలో, కొందరు దోపిడీ దొంగలు, కత్తులూ, ఈటెలూ ఝుళిపిస్తూ పరుగునవచ్చి, మేనాను చుట్టు ముట్టారు.

అంగరక్షకులు దొంగలతో తలపడ్డారు. కాని, అధిక సంఖ్యలో వున్న దొంగలు వాళ్ళను తేలిగ్గా ఓడించి, రాకుమారి సువర్ణ వున్న మేనా తలుపులు తెరవ బోయారు.

అయితే, ఆ క్షణంలో కొండ చరియపై నుంచి, భీతికొలిపే కేకలతోపాటు, కొన్ని బండరాళ్ళు కిందికి దొర్లుతూవచ్చి, వాళ్ళ మీద పడినై. వాటి కిందపడి దొంగల నాయకుడితోపాటు, మరిద్దరు దొంగలు మరణించారు.

ఇది చూసి దొంగలు భయకంపితులై, పారిపోయేందుకు దిక్కులు చూసేంతలో, కొందరు యువకులు కత్తులు దూసి, బండరాళ్ళ మీది నుంచి దుముకుతూ వచ్చి, వాళ్ళను చుట్టుముట్టారు. రాకుమారి అంగరక్షకులు కూడా ధైర్యం తెచ్చుకుని, దొంగల మీద పడ్డారు. కొద్ది క్షణాలలో దొంగలందరూ నిరాయుధులు చేయబడ్డారు.

రాకుమారిసువర్ణ రక్షణకు వచ్చిన, ఈ యువకులు, రాజధానిలో జరిగిన యుద్ధ విద్యాప్రదర్శనలలో పాల్గొని, తిరిగి తమ, తమ ప్రాంతాలకు వెళ్లిపోతున్నారు. వాళ్ళ నాయకుడి పేరు శేఖరుడు. అతడు కొన్ని నెలల కిందట విజయపుర రాజ్యం లోని మల్లులందరినీ ఓడించి, రాకుమారి నుంచి విలువైన బహుమతులు పుచ్చుకున్నాడు.

సువర్ణ వున్న మేనాతోపాటు కొందరు అంగరక్షకులు నగరానికి బయలుదేరారు. శేఖరుడూ, అతడి అనుచరులూ, దొంగలు పారిపోకుండా కాపలా వుండి, ఇద్దరు అశ్వికులను రాజప్రాసాదానికి పంపారు. జరిగింది విని, రాజు దొంగలను పట్టి తెచ్చేందుకు సైనికులకు ఆజ్ఞ ఇచ్చాడు. వాళ్ళు, దొంగలను తాళ్ళతో బంధించి తీసుకుపోయారు.

ఆ మర్నాడు శేఖరుడికి, రాజు నుంచి ఆహ్వానం వచ్చింది. ఆయన శేఖరుణ్ణి అభినందించి, చేసిన సహాయానికి ఎలాంటి బహుమానం కావాలని అడిగాడు.

అందుకు శేఖరుడు, ''మహారాజా, రాకుమారితో మాట్లాడేందుకు, నాకు అనుమతి ఇవ్వండి. బహుమానమేదో, ఆమె నుంచే స్వీకరిస్తాను,'' అన్నాడు.

రాజు ఇందుకు అనుమతించాడు. సువర్ణ, శేఖరుడికి తన కృతజ్ఞత చెప్పుకుని, ''నీకెలాంటి బహుమానం కావాలి?'' అని అడిగింది.





"మీ అభిమానానికి కృతజ్ఞుణ్ణి. నన్ను వివాహమాడవలసిందిగా కోరుతున్నాను. ఇది, మీ శక్తికి మించిన పని కాదుగదా!" అన్నాడు శేఖరుడు.

ఈ కోరిక వింటూనే సువర్ణ కొంతసేపు మౌనంగా వూరుకుని, తర్వాత శేఖరుడితో, "ఇది, నా శక్తికి మించినదో కాదో, చెప్ప లేను. ఏమైనా, నిన్ను వివాహం ఆడేందుకు, నా అభ్యంతరం ఏమీ లేదు. అయితే, ముందుగా, ఈ విషయం నా తండ్రిగారికి చెప్పవలసి వుంటుంది," అన్నది.

రాకుమారి జవాబు శేఖరుడికి చాలా ఆనందం కలిగించింది.

"నేనడిగినది ఇస్తానని, వాగ్దానం చేయగలరా?" అని ప్రశ్నించాడు శేఖరుడు.

"నా శక్తికి మించినది కాని దేదైనా సరే ఇస్తాను," అన్నది సువర్ణ.

ఆ జవాబుకు శేఖరుడు చాలా సంతోషించి, "యువరాణీ, నన్ను, మీరెరుగుదురు. లోగడ మీ చేతి మీదుగా, నా కొక బహుమానం ఇచ్చారు. దొంగల నుంచి మిమ్మల్ని కాపాడడంలో, నేను ప్రదర్శించిన ధైర్యసాహసాల గురించి, మీ అభిప్రాయం ఏమిటి?" అన్నాడు.

"నీ ధైర్యసాహసాలూ, సమయజ్ఞతా అమోఘం!" అన్నది సువర్ణ.

ఆ రాత్రి ఆమె తండ్రితో, "నాన్నా, మీ అనుమతితో, శేఖరుడు నన్ను చూడ వచ్చాడు. అతడు, దోపిడీదొంగలు నా ఒంటి మీది ఆభరణాలు దోచుకోకుండా కాపాడడమే కాదు, నా ప్రాణరక్షణ కూడా చేశాడు. ఆ నీచులు నన్ను తాకివున్నట్టయితే, ఎప్పుడూ నా దగ్గిర వుంచుకునే విషం మింగి వుండేదాన్ని. ఇప్పుడతడి కోర్కె ఏమంటే—నన్ను వివాహం ఆడాలని. అందుకు ఒప్పుకుంటే బావుండదా?" అన్నది.

రాజు కొంచెం ఆశ్చర్యపోయి, "నీకు, ఆ శేఖరుణ్ణి వివాహం ఆడాలని వున్నదా?" అని ప్రశ్నించాడు.



''రాజవంశస్థుణ్ణే పెళ్ళాడాలన్న పట్టు దల, నాకేం లేదు. ఆ శేఖరుడితో పెళ్ళి, నాకిష్టమే,'' అన్నది సువర్ణ.

''సరే, ఆ సంగతి ఆలోచిద్దాం,'' అన్నాడు రాజు.

ఆ మర్నాడే ఆయన శేఖరుడికి, ఈ వివాహం సాధ్యపడదని వర్తమానం పంపాడు.

శేఖరుడు దిగాలు పడిపోయి, రాకుమార్తె దగ్గిరకు వచ్చి, సంగతి చెప్పి, ''నేను, నిన్ను వివాహం ఆడలేకపోతే, నాకు మరణమే గతి,'' అన్నాడు.

రాకుమారి అతడికి సర్ది చెబుతూ, ''అంత దిగులు పడకు. నేను వీలువెంట, మా నాన్న, ఈ పెళ్ళికి ఒప్పుకునేలా చేస్తాను,'' అన్నది.

శేఖరుడు తృప్తిపడి, తన గ్రామానికి వెళ్ళిపోయాడు.

ఒక సంవత్సరకాలం గడిచిపోయింది. రాజుకు హఠాత్తుగా జబ్బు చేసి మంచం పట్టాడు. ఆ స్థితిలో ఆయన అప్పుడప్పుడూ సువర్ణతో, ''ఈ వ్యాధి నయం అవుతుందో లేదో అన్న భయంగా వున్నది. నీకు తగిన వరుణ్ణి చూసి, వివాహం చేయాలను కుంటున్నాను,'' అనసాగాడు.

సువర్ణ తండ్రితో, శేఖరుణ్ణి గురించి చెప్పాలనుకున్నది. ఆయన, అతడి సంగతే మరిచిపోయాడేమో అన్న అను మానం, ఆమెకు కలిగింది. అయితే, సువర్ణ ధైర్యం చేసి తండ్రికి, ఈ విషయం గుర్తు చేద్దామనుకుంటున్న తరుణంలో, ఒక విపత్తు జరిగింది.

సువర్ణ సోదరుడు గురుకులంలో విద్యాభ్యాసం ముగించి, ఇంటికి తిరిగి వస్తూ, గుర్రం మీది నుంచి కిందపడి మరణించాడు. ఈ విషాదవార్త వింటూనే, దీర్ఘవ్యాధితో బాధపడుతున్న రాజు, గుండెలవిసి ప్రాణాలు వదిలాడు.

ఇది చూసి రాకుమారి దిగులుతో కుంగి పోయింది. అయినా సింహాసనానికి వారసు రాలు గనక, రాజ్యపాలన విషయంలో



అశ్రద్ధ చేయడం క్షమించరాని నేరం అవుతుంది. ఆ కారణంగా, ఆమె వెంటనే పట్టాభిషిక్తురాలై, విజయపుర రాజ్యానికి రాణి అయింది.

ఇది జరిగిన కొద్ది రోజుల తర్వాత, ఆమె ఒక నమ్మకస్థుడైన సేవకుణ్ణి, శేఖరుడుండే గ్రామానికి పంపింది. వాడు తిరిగి వచ్చి, శేఖరుడు కొన్నాళ్ళక్రితం, గ్రామం నుంచి ఎక్కడికో వెళ్ళినట్టు చెప్పాడు. అతడు వచ్చేవరకూ వేచి వుండాలనుకున్నది, సువర్ణ.

ఒకసారి ఆమెకు రాజ్యంలోని సామాన్య ప్రజల పరిస్థితులు ఎలా వున్నదో, స్వయంగా చూడాలన్న కోర్కె కలిగింది. అందుకు ఆమె, రాజ్యసరిహద్దుల్లో వున్న ఒక గ్రామానికి మారువేషంలో బయలుదేరింది. ఆ గ్రామంలోని శివాలయం చాలా ప్రసిద్ధి కలది. శివరాత్రి నాడు ముఖ్యంగా స్త్రీలు, శివార్చనకోసం ఆలయానికి వస్తారు.

కొన్నాళ్ళుగా ఆ ప్రాంతాన గల కొండల్లో, దారిదోపిడీ దొంగలబెడద ముమ్మరంగా వున్నది. అయితే, ఆలయానికి వచ్చే భక్తుల దగ్గర విలువైన వస్తువులేమీ వుండవు గనక, వాళ్ళు మాత్రం నిర్భయంగా శివాలయానికి రాకపోకలు జరుపుతున్నారు.

సువర్ణ అలాంటి వాళ్ళతో కలిసి కొంత దూరం ప్రయాణం చేశాక, హఠాత్తుగా, ఒక కొండమలుపులో, కొందరు దొంగలు వాళ్ళ మీదికి వచ్చి పడ్డారు. వాళ్ళు, సువర్ణకు ఆయుధాలు చూపి భయపెట్టి, ఒక గుర్రపుబండిలో ఆమెను ఎక్కించి, కొండకోనలో వున్న ఒక ఇంటికి తీసుకుపోయి, "ఏం భయపడకు. నీ మేలు కోరే ఇక్కడికి తీసుకువచ్చాం." అన్నారు.

ఒక గంట గడిచీగడవకుండానే దొంగల నాయకుడు అక్కడికి వచ్చాడు. వాడు, సువర్ణ కేసి పరీక్షగా చూసి, "నేనొక అందగత్తెను పెళ్ళాడాలనుకున్నాను. నా అనుచరులు మంచి అందగత్తెనే ఎన్నిక



చేసి తెచ్చారు." అని ఒక క్షణం ఆగి, "నేనెక్కడో ఒకసారి నిన్ను చూసినట్టున్నది!" అన్నాడు ఆశ్చర్యపోతూ.

"నువ్వు శేఖరుడివి కాదా?" అని ప్రశ్నించింది, సువర్ణ.

దొంగల నాయకుడు ఉలిక్కపడి, "నా పేరు నీకెలా తెలుసు? నన్నందరూ భీమనాయకుడని పిలుస్తారు," అన్నాడు.

సువర్ణ చిన్నగా నవ్వి, "నువ్వు, నన్ను గుర్తించలేదన్నమాట! నేను రాకుమారి సువర్ణను. నిన్ను వివాహం ఆడగోరి, కొన్నాళ్ళ క్రితం, మీ గ్రామానికి మనిషిని పంపాను. కాని, నువ్వు గ్రామంలో లేవు," అన్నది.

"ఆహా, ఎంత అద్భుతమైన సంగతి! నువ్వు నిజంగా నన్ను వివాహమాడగలవని అనుకోలేదు. నా అనుచరులకు ఒక అందగత్తెను పట్టుకురమ్మని ఆజ్ఞ ఇచ్చాను; వాళ్ళు నిన్ను తెచ్చారు. మనం ఒకళ్ళనొకళ్ళం ఇలా చూడగలగడం, విధివిలాసం!" అన్నాడు శేఖరుడు.

"అవును, ముమ్మాటికీ విధివిలాసమే!" అన్నది సువర్ణ.

శేఖరుడు ఆ జవాబుకు పరమానందం చెందాడు. సువర్ణ తనకు తానై వివాహమాడదలచినట్టు చెప్పింది కనక, అతడు ఆమెకు కాపలా వాళ్ళను పెట్టలేదు. ఆమె, ఆ ఇంటిముందున్న ఆవరణలో స్వేచ్ఛగా తిరగసాగింది.

తమ రాణి మారువేషంలో బయలుదేరినప్పుడు, ఆమెకు రక్షణగా కొందరు సైనికులు కూడా మారువేషాల్లో బయలుదేరారు. వాళ్ళు, ఆమె వున్నచోటు తెలుసుకుని రాగానే, సువర్ణ వాళ్ళను సంజ్ఞలతో హెచ్చరించింది.

ఒక నడిరాత్రివేళ, రాజధానినుంచి వచ్చిన సైనికులు, శేఖరుడి స్థావరాన్ని చుట్టుముట్టి, అనుచరులతోపాటు, అతణ్ణి బంధించారు. రాజప్రాసాదానికి తిరిగి వస్తూనే సువర్ణ, దారిదోపిడీవాళ్ళందర్నీ,

వాళ్ళనాయకుడు శేఖరుడితోపాటు విచారణ చేసి, ఉరితీయపలసిందిగా ఆజ్ఞలు జారీచేసింది.

బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా, రాకుమారి సువర్ణ ప్రవర్తన, అతిహేయం కాదా? ఆమె శేఖరుణ్ణి వివాహమాడగలనని వాగ్దానం చెయ్యడమేకాక, తనకై తాను, అతడి గ్రామానికి మనిషిని కూడా పంపింది. కాని, అతడి అనుచరులామెను, శివాలయ యాత్రికులతోపాటు వున్నప్పుడు పట్టుకుని, అతడి దగ్గిరకు తీసుకుపోగానే, అతడికి ద్రోహం తలపెట్టింది. ఇది వాగ్దాన భంగంకాదా ? శేఖరుడు, తాము ఇలా కలుసుకోవడం, విధివిలాసం అన్నప్పుడు, అవునని జవాబిచ్చింది. ఇది అబద్ధం ఆడటంకాదా? ఈ సందేహానికి సమాధానం తెలిసికూడా చెప్పకపోయావో, నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "సువర్ణకు, శేఖరుడు తనను దొంగలబారినుంచి కాపాడాడన్న కృతజ్ఞత వున్నది. ఆ కారణం వల్లనే—అతడామెను వివాహమాడ కోరినప్పుడు అంగీకరించింది. అతడానాడు ధైర్యసాహసాలు కలవాడేకాక, నీతిమంతుడు. కాని, ఇప్పుడు అసహాయుల్నీ, నిరాయుధుల్నీ దోచుకునే దారి దోపిడీ దొంగల నాయకుడు. సువర్ణ వివాహమాడతానని వాగ్దానం చేసింది, ఈ దొంగకుకాదు. ఇక, విధివిలాసం సంగతి. శేఖరుడు, తాము అనుకోకుండా, ఇలా ఒకర్ని ఒకరు చూడగలగడం, విధివిలాసం అన్నది, ఒక అర్థంలో. సువర్ణ అవునన్నది, మరొక కారణంవల్ల. ఆమె, అతడు దొంగల నాయకుడయ్యాడని తెలుసుకోకపోతే, అతణ్ణి వివాహం ఆడి, జీవితకాలమంతా బాధపడేది. అందుకే, అయాచితంగా, ఆ వాస్తవం తెలుసుకోవడం, ఆమెకు విధివిలాసంగా కనిపించింది," అన్నాడు.

రాజుకు ఈవిధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)






మన దేవాలయాలు :

# గయ-బుద్ధగయ

వేనవేల సంవత్సరాల క్రితం, గయాసురుడనే రాక్షసుడు విష్ణువును గురించి తపస్సు చేశాడు. అసమానమైన శక్తి సాధించడానికి అతడు ప్రారంభించిన తపస్సు, నెలలూ, సంవత్సరాలూ గడిచినా నిరంతరాయంగా, దీక్షతో సాగుతూ వచ్చింది.

గయాసురుడి ఉగ్రమైన తపస్సు చూసిన దేవతలకు భయాశ్చర్యాలు కలిగాయి. రాక్షసుడయిన అతడి తపస్సు ఫలించి, అమితమైన శక్తి సిద్ధించినట్టయితే, అతడు సాధువులనూ, సజ్జనులనూ హింసించగలడని ఊహించి, దేవతలు అతడి తపస్సుకు భంగం కలిగించడానికి పథకం వేశారు.





దేవతలలో ఒకడు గయాసురుణ్ణి సమీపించి, "నాకు చాలా అలసటగా ఉన్నది. నీ భుజం మీద కాస్త విశ్రాంతి తీసుకుంటాను," అన్నాడు. గయాసురుడు అందుకు సంతోషంగా అంగీకరించాడు. ఆ దేవుడు అతడి భుజం మీదికి ఎక్కి కూర్చున్నాడు.




ఆ తరవాత తక్కిన దేవతలందరూ, మొదటి దేవుడి లాగానే, గయాసురుణ్ణి సమీపించి, తమ కోరికలను వెలి బుచ్చారు. గయాసురుడు సంతోషంగా తన దేహాన్ని పెంచి, దేవతలందరికీ, భుజాల మీదా, చేతుల మీదా, ఒడి లోనూ, స్థానం కల్పించాడు. కొంత సేపటికి దేవతలు, అతణ్ణి క్రమంగా నేలలోకి అణగద్రొక్క సాగారు.

దేవతల ఉద్దేశాన్ని గయాసురుడు గ్రహించాడు. విష్ణువు మీది అచంచలమైన భక్తి కారణంగా, అతడు వాళ్ళనందరినీ వినయంగా సహిస్తూ, "దేవతలారా, మీ అభీష్టానుసారం నేను భూమిలోకి వెళ్ళిపోతాను. అయితే, మీరు నన్నెప్పుడూ వదలకుండా ఉంటామని మాట ఇవ్వాలి," అన్నాడు. దేవతలు అందుకు అంగీకరించారు. గయాసురుడు పూర్తిగా భూమిలోకి కూరుకుపోయాడు.





ఆ స్థలంలోనే బ్రహ్మదేవుడు యజ్ఞం చేశాడు. దేవతలతో సహా గయాసురుడు అక్కడ భూస్థాపితం కావడం వల్ల, అతని భక్తికీ, వినయానికీ ముగ్ధుడయిన విష్ణువు, అక్కడ ప్రత్యక్షమై, గయాసురుడి అత్మనూ, ఆ స్థలాన్ని ఆశీర్వదించాడు.

విష్ణువు ప్రత్యక్షమైన ఆ స్థలంలో, విష్ణు పాదపద్మాల గురుతులు ఏర్పడ్డాయి. ప్రస్తుతం ఇక్కడ వెలిసే విష్ణు పాద మందిరాన్ని ఇండోర్‌ను పరిపాలించిన రాణి అహల్యాబాయి నిర్మించింది.






గయాక్షేత్రంగా ప్రసిద్ధిగాంచిన ఈ పుణ్య క్షేత్రంలో, పితృకార్యాలు నెరవేరుస్తారు. రోజూ చుట్టుపక్కల నుంచి అసంఖ్యాకమైన ప్రజలు వచ్చి, పితృదేవతల ప్రీతి కోసం తర్పణాది కృత్యాలు ఆచరిస్తారు.

దివ్యాత్మల విధంగానే, ఫల్గూనది ఈ ప్రదేశంలో అంతర్వాహినిగా, అదృశ్యంగా ప్రవహిస్తున్నది. భక్తులు నేలను తవ్వినట్టయితే, వెంటనే జలం ఊరుతుంది. ఈ జలాన్ని ఎంతో మహిమాన్వితమైనదిగా భక్తులు విశ్వసిస్తారు.





గౌతమబుద్ధుడు, రావిచెట్టు కింద, ధ్యాననిమగ్నుడై, జ్ఞానసిద్ధి గాంచిన బుద్ధగయక్షేత్రం—గయకు పధ్నాలుగు కిలోమీటర్ల దూరంలో ఉన్నది. బుద్ధుడికి నీడనిచ్చిన అశ్వత్థ వృక్షం నుంచి పుట్టిన, వందసంవత్సరాలనాటి రావిచెట్టు ఈనాడు ఇక్కడ ఉన్నది.

ఇక్కడి మహాబోధి ఆలయం, విలక్షణమైన బౌద్ధ శిల్పకళకు ఉదాహరణగా వెలుగొందుతున్నది. ఈ ఆలయ ముఖద్వారం అద్భుతమైన శిల్పాలతో వెలుగొందుతున్నది. ఈ గుడిలో బంగారు రేకులతో తాపడం చేయబడిన బుద్ధ విగ్రహం ఉన్నది. ఈ దేవాలయం అనేక శతాబ్దాలుగా దేశ విదేశ భక్తులను ఆకర్షిస్తున్నది.






జ్ఞానసిద్ధి అనంతరం, బుద్ధుడు లేచి నిలబడి, కృతజ్ఞతతో, సుదూర తీరాల కేసి, ప్రశాంతంగా చూస్తూ నిలబడిన స్థలం—అనిమేషలోచనచైత్య. మహాబోధి ఆలయ సమీపంలోనే ఈ పవిత్ర స్థలం ఉన్నది.



# అసలుదొంగ

శివపురం అనే పెద్ద గ్రామంలో బాటసారులకు మంచి సౌకర్యం గల సత్రం ఒకటుండేది. ఒకనాటి ఉదయం అక్కడ ఇద్దరు బాటసారులు, ఒక డబ్బు సంచీ నాదంటే నాదని పోట్లాడుకోసాగారు. అది చూసిన గ్రామ కాపలావాళ్ళు, వాళ్ళిద్దర్నీ గ్రామాధికారి దగ్గరకు లాక్కుపోయారు.

గ్రామాధికారి నిజం చెప్పమని ఎంత గద్దించి అడిగినా, సంచీ నాదని వాదులాడుకోవడం తప్ప, వాళ్ళు నిజం చెప్పలేదు. దానితో విసిగిపోయిన గ్రామాధికారి, వాళ్ళను చీకటి కొట్లో పడవేయమని కాపలావాళ్ళను ఆజ్ఞాపించాడు.

వాళ్ళిద్దరిలో ఒకడు మాత్రమే దొంగ అని తెలుస్తూనే వున్నది. అయితే, బలమైన ఆధారాలు దొరికితే తప్ప, దొంగను పట్టడం సాధ్యపడదని గ్రామాధికారి గ్రహించాడు. గతంలో ఇలాంటి గడ్డు సమస్యలు ఎదురైనప్పుడు రాజులూ, మంత్రులూ ఏదో ఒక ఉపాయంతో సమస్యను పరిష్కరించేవాళ్ళు. తను కూడా అదే విధంగా దొంగను బయటపెట్టేందుకు ఉపాయం కోసం ఆలోచించసాగాడు.

రెండు, మూడు రోజులు గడిచినై. గ్రామాధికారి చాలా సున్నితమైన మనస్తత్వం కలవాడు. తను కొట్లో బంధించిన వాళ్ళలో ఒకడే దోషి అనీ, వాడితోపాటు నిర్దోషి అయినవాణ్ణి కూడా కష్టాలకు గురిచేశాననీ ఆయన బాధపడసాగాడు.

ఆ సమయంలో ఆయన కొక వార్త చేరింది: రాజధాని నుంచి ఒక ఉన్నతాధికారి గ్రామాల బాగోగులు తెలుసుకుంటూ శివపురం వస్తున్నాడు.

గ్రామాధికారి, ఆయనను గ్రామ పొలిమేరలలో కలుసుకుని, గ్రామాన్ని గురించిన అన్ని వివరాలూ తెలియజేశాడు.

దాసరి వెంకటరమణ



సమస్యకు పరిష్కారం దొరికింది! వాళ్ళిద్దరూ పచ్చిదొంగలు. ఈ డబ్బు సంచీ నాదే. రెండు రోజుల క్రితం ఎవరో దీన్ని తెలివిగా, నా నుంచి దొంగిలించారు. వాళ్ళు నువ్వు కొట్లో వేయించినవాళ్ళే అయి వుంటారు,'' అన్నాడు.

ఆ ఉన్నతాధికారి మాటలు వింటూనే, గ్రామాధికారి తానూ ఆశ్చర్యపోయి, ''అయ్యా, ఇక్కడ ఒక సంగతి తమరు గమనించాలి. డబ్బు సంచీ చూస్తూనే, నాదీ అనేశారు, బాగానే వున్నది. కాని, అందుకు ఇతరత్రా తగిన సాక్ష్యాధారం కావాలిగదా? అలాంటి దేమీ లేకుండా, డబ్బు మీపరం చెయ్యడమంటే మూర్ఖత్వ మనిపించుకుంటుంది,'' అన్నాడు.

తర్వాతతన కెదురైన గడ్డు సమస్య గురించి చెప్పి, ''వాళ్ళల్లో ఒకడు దొంగ; రెండవ వాడు, ఆ డబ్బు సంచీకి హక్కుదారు. నేను దొంగ ఎవరైనదీ కనిపెట్టలేక పోవడంతో, పాపం, అతణ్ణీ చీకటి కొట్లో వేయవలసి వచ్చింది!'' అన్నాడు.

అందుకు ఉన్నతాధికారి కొంచెంసేపు ఆలోచించి, ''నీ పదవిలో ఇలాంటివి సహజమే. దోషులను పట్టుకునే ప్రయత్నంలో, నిర్దోషులకు కూడా బాధ కలిగించవలసి వస్తుంది. నువ్వు మరీ అంత సున్నితంగా ఆలోచించకూడదు,'' అన్నాడు.

తర్వాత ఆయన డబ్బు సంచీ చూసి ఆశ్చర్యపడుతూ, ''నువ్వనే, ఆ గడ్డు

''అవును, నువ్వు చెప్పిందీ నిజమే. ఆ దొంగ లిద్దర్నీ పిలిపించి, నా సమక్షంలో ప్రశ్నించు. నిజానిజాలు తెలిసి పోగలవు,'' అన్నాడు ఉన్నతాధికారి.

గ్రామాధికారి చీకటి కొట్లో వున్న ఇద్దర్నీ పిలిపించి, లోగడ అడిగినట్టే, ''నిజం చెప్పండి? ఈ డబ్బు, మీ ఇద్దరిలో ఎవరిది?'' అని అడిగాడు.

వాళ్ళు మామూలు ధోరణిలో నాదంటే నాది అన్నారు.

గ్రామాధికారి వాళ్ళకేసి కోపంగా చూస్తూ, ''ఇది మీ ఇద్దరిలో ఎవరిదీ

కాదు. రాజధాని నుంచి వచ్చిన, ఈ ఉన్నతాధికారిది. ఇప్పటికైనా నిజం ఒప్పుకుంటే, కొద్ది శిక్షతో విడుదల చేస్తాను,'' అన్నాడు.

గ్రామాధికారి ఇలా అనగానే, వాళ్ళల్లో ఒకడు ఎంతో బాధగా, ''అయ్యా, ఈ రాజ్యంలో ధర్మానికేదో చీడపురుగు పట్టింది. నా కష్టార్జితాన్ని ఇప్పటికే, ఒకడు దొంగిలించ చూస్తున్నాడు. అది చాలక, ఉన్నతాధికారినంటూ, యిప్పుడీ యనవచ్చి తస్కరించే ప్రయత్నంలో వున్నాడు. న్యాయనిర్ణయం చేయగల నిజాయితీపరులూ, బుద్ధిశాలులూ కనిపించడం లేదు,'' అన్నాడు.



అయితే, రెండవవాడు మాత్రం బాగా రెచ్చిపోయి, గ్రామాధికారితో, ''న్యాయ నిర్ణయం చెయ్యడం, నీ శక్తికి మించిన పని. అందుకు ఎంతో ఓర్పూ, బుద్ధి సూక్ష్మతా కావాలి. ఆ రెండూ నీకు లేవు. అందువల్లనే, ఎవరో ఉన్నతాధికారి నంటూ రాగానే, డబ్బు ఆయనదంటూ తీర్పిస్తున్నావు!'' అన్నాడు.

గ్రామాధికారి వచ్చే కోపాన్ని అపుకుంటూ, ''అలాగా! ఆ సంగతి నువ్వంత దృఢంగా ఎలా చెప్పగలవు?'' అన్నాడు.

''ఎలానంటే—నాతోపాటు చీకటి కొట్లో వున్న ఇతను, ఇక్కడి సత్రంలో చేరక ముందు, ఒక గ్రామంలో, ఆ డబ్బును ఒక వ్యాపారి ఇవ్వగా తీసుకోవడం, నేను కళ్ళారా చూశాను. స్వార్థం కారణం గానో, అశక్తతవల్లో, నువ్వు న్యాయం పేరుతో, ఇలాంటి అన్యాయమైన తీర్పులు ఇస్తున్నావు. నీ పైన రాజుగారికి ఫిర్యాదు చేస్తాను,'' అన్నాడు దొంగ.

ఇది విని, గ్రామాధికారి, ఉన్నతాధికారి నంటూ వచ్చినతనికేసి కళ్ళెర్రచేసి, ఏదో అనబోయేంతలో, అతను చిరునవ్వు నవ్వి, ''ఎలానైతేనేం, అసలుదొంగ దొరికిపోయాడు! పరిస్థితుల కారణంగానే మనుషులు చెడు—మంచివాళ్ళుగా తయారవుతారనే మాటసత్యం,'' అన్నాడు.

ఆ మాటలకు గ్రామాధికారి కను బొమలు ముడిచి, "రాజోద్యోగి వేషంలో మోసాలు చేస్తూ, రాజుగారిని అపకీర్తి పాలు చేయడం, క్షమించరాని మహా నేరం. నిన్నిప్పుడే నగరానికి తీసుకు పోయి, రాజుగారికి ఫిర్యాదు చేస్తాను," అన్నాడు.

"నేనూ సాక్షిగా తమ వెంట వస్తాను," అన్నాడు దొంగ.

రాజోద్యోగి ఆ ఇద్దరి కేసి మెచ్చు కుంటున్నట్టు చూసి, "కారణాలు వేరైనా, మీ ఇద్దరికీ న్యాయనిర్ణయం పట్ల వున్న పట్టుదల, నాకు సంతోషం కలిగిస్తున్నది. డబ్బు తనకు లభ్యం కానప్పుడు, అది దాని హక్కుదారుకే చేరాలన్న సదభిప్రాయం దొంగకు కలగడం మెచ్చదగింది!" అని, గ్రామాధి కారి భుజం తడుతూ, "నిర్దోషి శిక్షకు పాత్రుడు కాకూడదు, అన్న ధర్మబుద్ధితో న్యాయనిర్ణయం చేసేందుకు గట్టి ప్రయత్నం చేశావు; అందుకు నిన్నభినం దిస్తున్నాను. నేను, ఈ దేశాన్నేలే రాజును!" అంటూ తన మారువేషం తొలగించాడు.

అది చూసి గ్రామాధికారీ, దొంగా, డబ్బు యజమానీ ఎక్కడలేని ఆశ్చర్యం పొందారు.

రాజు స్వయంగా డబ్బు సంచీని, దాని యజమాని కిచ్చి, గ్రామాధికారితో, "నీవంటి వాడొకడు సలహాదారుగా వుండడం, నాకెంతయినా అవసరం. నిన్ను, నా సలహాదారుల్లో ఒకడుగా నియ మిస్తున్నాను. సలహాదారుకు అంగరక్షకు డంటూ వుండాలి గదా! నిజాయితీ పరుడైన, ఈ దొంగకు నీ అంగరక్షకుడి నౌకరీ ఇవ్వడం ఎలా వుంటుంది?" అన్నాడు.

"తమ ఇష్టమే, నా ఇష్టం, మహా రాజా," అన్నాడు గ్రామాధికారి.

దొంగ ఎక్కడలేని ఆనందంతో రాజుకూ, గ్రామాధికారికీ సాష్టాంగ నమ స్కారం చేసి లేచి నిలబడ్డాడు.





# ఉత్తరరామాయణం

తన మనమలు ముగ్గురూ బ్రహ్మవల్ల వరాలు పొందిన సంగతి పాతాళంలో ఉన్న సుమాలికి తెలిసింది. భయం తీరి పోయి ఆయన తన మంత్రులైన మారీచ, ప్రహస్త, విరూపాక్ష, మహోదరులను వెంటబెట్టుకుని అట్టహాసంగా బయలుదేరి రావణుడి వద్దకు వచ్చి, అతన్ని కౌగిలించుకుని, "బాబూ, ఇంత కాలానికి నా కోరిక పండింది. ఏ విష్ణుమూర్తి భయంచేత మేం లంకను విడిచిపెట్టి పాతాళానికి వెళ్ళిపోయామో ఆ విష్ణు భయం పోయింది. ఎందుకంటే, నీవు బ్రహ్మ నుంచి ఉత్తమ వరాలు పొందావు. అసలు లంక మన రాక్షసులదే, దాన్ని బుద్ధిశాలి అయిన నీ సవతి అన్న కుబేరుడు ఆక్రమించి కూర్చున్నాడు. వీలునుబట్టి మంచి మాటలతోనో, లంచం పెట్టో, బలాత్కారంగానో నీవు మీ అన్న వద్ద నుంచి లంకను తిరిగి సంపాదించు. నిక్షేపంగా నీవే లంకకు రాజుగా ఉండు. ఇలా చేశావంటే దిక్కు లేకుండా ఉన్న రాక్షసవంశాన్ని ఉద్ధరించినవాడివవుతావు," అన్నాడు.

అంతా విని రావణుడు, "అదేమిటి తాతా? కుబేరుడు మాకు తండ్రితో సమానుడు. నీ విలా అనకూడదు, నేను వినకూడదు," అన్నాడు.

సుమాలి ఆపైన ఇంకేమీ అనలేక పోయాడు. ఆ తరవాత, కొన్నాళ్ళకు, సుమాలి మంత్రులలో ఒకడైన ప్రహస్తుడు

**3. రావణుడి లంకానగరప్రవేశం**



లేదు. ఈ దురన్యాయం అదివరకు జరుగుతూ వస్తున్నదే. అందుచేత నేను చెప్పినట్టు చెయ్యి. మనవాళ్ళందరూ సుఖపడతారు.''

రావణుడు కొంచెంసేపు ఆలోచించి సరే నన్నాడు. వెంటనే అతను ప్రహస్తుణ్ణి దూతగా కుబేరుడి వద్దకు పంపి, ఇలా అడిగించాడు:

''అన్నా, ఇప్పుడు నీ అధీనంలో ఉన్న లంక అసలు రాక్షసులది. అందుచేత నీవు లంకను రాక్షసుల కిచ్చేసినట్టయితే ధర్మంగా వర్తించిన వాడివవుతావు. తమ్ముడినైన నా ముద్దు తీర్చినవాడివీ అవుతావు.''

ప్రహస్తుడు వచ్చి ఈ మాటలు రావణుడి తరఫున చెప్పగానే, కుబేరుడు రావణుడితో తన మాటగా ఇలా చెప్పమన్నాడు: ''తమ్ముడూ, మన తండ్రి నాకీ లంకానగరాన్నిచ్చినప్పు డక్కడ రాక్షసు లెవరూ లేరు. నేనూ, నా యక్షులూ ఇక్కడ ఉంటున్నాం. నా రాజ్యమూ, నా పట్టణమూ, నా ఐశ్వర్యమూ నీది కాదా? వచ్చి హాయిగా రాజ్యమేలు. ఒక తండ్రి బిడ్డలమైన మన మధ్య తేడాలు దేనికి?''

ఈ మాటలు చెప్పి ప్రహస్తుణ్ణి పంపేసి, కుబేరుడు వెంటనే పుష్పక మెక్కి తన

రావణుణ్ణి ఒంటరిగా పట్టుకుని ఈ విధంగా నూరిపోశాడు:

''అబ్బాయీ, నీవు మీ తాతగారితో అన్న మాట భావ్యంగా లేదు. శూరుడైన వాడికి అన్నదమ్ములన్న విచక్షణ ఏమిటి? అన్నదమ్ముల వైరం ఆదినుంచీ వస్తున్నదే. అదితీ, దితీ అక్కచెల్లెళ్ళే. ఇద్దరూ కశ్యపబ్రహ్మకు భార్యలై దేవతలనూ, రాక్షసులనూ కన్నారు. కాని, విష్ణువు రాక్షసులను చావగొట్టి మూడు లోకాలూ దేవతలకు కట్టబెట్టాడు. ఈ లంకే గాక, భూమండలం యావత్తూ ఒకప్పుడు రాక్షసులే అనుభవించారు. మేం నిన్ను కొత్తగా తప్పు పని చెయ్యమని చెప్పటం

తండ్రి వద్దకు వెళ్ళి జరిగిన సంగతి చెప్పాడు.

విశ్రవసుడు కుబేరుడు చెప్పినదంతా విని, "నాయనా, నే నొకటి చెబుతాను విను. రావణు డీ మాట నాతో అంటే కోప్పడ్డాను. వాడి కిప్పుడు వరాలు రావటం చేత ఒళ్ళు తెలియకుండా ఉంది. నీవు మటుకు లంకను విడిచిపెట్టి, కైలాస పర్వతం మీదికి వెళ్ళి, అక్కడ నివాసం ఏర్పాటు చేసుకో. అక్కడ మందాకినీ నదిలో బంగారు తామర పువ్వులున్నాయి. ఆ పర్వతం మీద ఎప్పుడూ దేవతలూ, గంధర్వులూ, అప్సరలూ, ఉరగులూ, కిన్నరులూ విహరిస్తూ ఉంటారు. ప్రస్తుతం రావణుడితో వైరం మటుకు పెట్టుకోకు," అని సలహా ఇచ్చాడు.

కుబేరుడు తండ్రి మాట పాటించి, తన భార్యనూ, బిడ్డలనూ, మంత్రులనూ, పరివారాన్నీ, ధనాన్నీ, వాహనాలనూ వెంటబెట్టుకుని కైలాస పర్వతానికి వెళ్ళి పోయాడు.

ప్రహస్తుడు రావణుడి వద్దకు పరమానందంతో వెళ్ళి, "రావణా, లంక ఖాళీ అయింది. కుబేరుడు అక్కడి నుంచి పరివారంతో సహా వెళ్ళిపోయాడు. అక్కడికి వెళ్ళి మమ్మల్నందరినీ పెట్టుకుని రాజ్యం చెయ్యి," అన్నాడు.



రావణుడు తన తమ్ములనూ, బలగాన్నీ వెంటబెట్టుకుని లంకకు వెళ్ళాడు. అక్కడ అతనికి వైభవంగా రాజ్యాభిషేకం జరిగింది. రాక్షసులతో క్రిక్కిరిసిన లంకకు కళ వచ్చినట్టయింది. ఇవతల రావణుడు లంకానగరాన్ని పాలిస్తుంటే, అవతల అతని అన్న అయిన కుబేరుడు అలకానగరాన్ని పాలించసాగాడు.

లంకా రాజ్యాధిపత్యం పొందాక రావణుడు తన చెల్లెలైన శూర్పణఖను, కాలకేయ వంశంలో పుట్టిన విద్యుజ్జిహ్వుడనే వాడి కిచ్చి పెళ్ళి చేశాడు.

కొంత కాలం గడిచాక రావణుడు వేటకు వెళ్ళి అరణ్యంలో ఒక పెద్ద



మనిషినీ, ఆయన వెంట ఉన్న ఒక అమ్మాయినీ చూసి, "మీ రెవరు? నిర్జనమైన ఈ అరణ్యంలో ఈ పిల్లను వెంటబెట్టుకుని ఎందుకు తిరుగుతున్నారు?" అని అడిగాడు.

దానికా పెద్దమనిషి ఇలా చెప్పాడు: "నాయనా, నేను దితి కొడుకును. నా పేరు మయుడు. నీవు హేమ అనే అప్సరస గురించి వినే వుంటావు. దేవతలు నాకా హేమ నిచ్చి పెళ్ళి చేశారు. ఈ పిల్ల మా ఇద్దరికీ పుట్టిన కూతురు. దీని పేరు మండోదరి. పధ్నాలుగేళ్ళ క్రితం హేమ నన్ను విడిచిపెట్టి స్వర్గానికి వెళ్ళిపోయింది. ఈ పిల్లకు తగిన భర్తను వెతుక్కుంటూ బయలుదేరాను. ఈ పిల్ల కాక, మరి ఇద్దరు కొడుకులు కూడా నాకు హేమవల్ల కలిగారు. ఒకడి పేరు మాయావి, రెండోవాడి పేరు దుందుభి. నా సంగతి అడిగావు గనక చెప్పాను. ఇక నీ సంగతి కూడా కాస్త చెబుతావా ఏమిటి?"

"నేను పులస్త్యబ్రహ్మ మనమణ్ణి, విశ్రవోబ్రహ్మ కొడుకును. నా పేరు దశగ్రీవుడు," అన్నాడు రావణుడు.

రావణుడు మహర్షుల వంశంలో పుట్టాడని తెలియగానే, మయుడు తన కుమార్తెను అతని కిచ్చి పెళ్ళి చెయ్యటానికి సిద్ధపడ్డాడు. రావణుడు సరేనన్నాడు. అక్కడే అప్పుడే అగ్నిని ప్రజ్వలింపజేసి, మయుడు తన కూతురి చెయ్యి రావణుడి చేతిలో పెట్టి, అగ్నిసాక్షిగా ఆ ఇద్దరికీ వివాహం చేశాడు. అప్పుడే ఆయన తన అల్లుడికి ఒక మహాశక్తిని ఇచ్చాడు. అది ఎంతో తపస్సు చేయగా లభించిన ఆయుధం; దానితోనే ఆ తరవాత రావణుడు లక్ష్మణుణ్ణి మూర్ఛపోగొట్టాడు.

రావణుడు తన భార్యతో సహా లంకకు వెళ్ళి, తన తమ్ముల పెళ్ళి ప్రయత్నాలు చేశాడు. వైరోచనుడి మనుమరాలు వజ్రజ్వాల అనేదాన్ని కుంభకర్ణుడికీ,

శైలూషు డనే గంధర్వరాజు కూతురు సరమ అనేదాన్ని విభీషణుడికీ నిశ్చయించి వైభవంగా పెళ్ళి చేశాడు.

ముగ్గు రన్నదమ్ములూ లంకలో తమ భార్యలతో సుఖంగా కాపరం చేస్తుండగా రావణుడి భార్య మండోదరి మేఘనాదుణ్ణి కన్నది. ఆ కుర్రవాడు భూమి మీద పడుతూనే మేఘం ఉరిమినట్టుగా ఏడ్చాడట. అందుకని వాడికి మేఘనాదుడని పేరు పెట్టుకున్నారు. ఆ కుర్రవాడంటే తల్లిదండ్రులకు ఎంతో ప్రేమ. ఆ మేఘనాదుడే యుద్ధంలో లక్ష్మణుడి చేతిలో చచ్చిన ఇంద్రజిత్తు.



ఒకనాడు రావణుడు కొలువు తీరి ఉండగా కుంభకర్ణుడు బ్రహ్మాండంగా ఆవలించి, "అన్నా, నాకు నిద్ర ముంచుకొస్తున్నది. నేను పడుకోవటాని కేదన్నా ఏర్పాటు చెయ్యి." అన్నాడు.

అది బ్రహ్మవరం వల్ల ఆవహించిన నిద్ర.

రావణుడు కుంభకర్ణుడి కొక నిద్రాభవనం అద్భుతంగా కట్టించి ఇచ్చాడు. అది చాలా వెడల్పూ, అంతకు రెండింతలు పొడుగూ కలిగి, స్ఫటిక శిలాస్తంభాలూ, దంతపు తోరణాలూ అమర్చి, తలుపులకూ, గోడలకూ బంగారమూ, మణులూ పొదిగినటువంటిది. కుంభకర్ణుడు అందులో పడుకుని సంవత్సరాల తరబడి నిద్రపోయాడు.

ఒకవంక కుంభకర్ణుడు అలా పడి నిద్రపోతుంటే, రావణుడు తన అసాధారణ బలాన్ని అండ చేసుకుని, దేవతలనూ, ఋషులనూ, యక్షులనూ, గంధర్వులనూ యథేచ్ఛగా బాధించసాగాడు. మదించిన ఏనుగు నీటిలో ప్రవేశించి కెలికినట్టుగా రావణుడు నందనోద్యానం మొదలైన దేవతల ఉద్యానాలను ధ్వంసం చేశాడు.

తన తమ్ముడు చేస్తున్న పనులు దూష్యమైనవని బాధపడి, కుబేరుడు, తన వంశ గౌరవానికి తగిన బోధనలను తమ్ముడికి చేయదలచి, రావణుడి వద్ద కొక దూతను



పంపాడు. ఆ దూత లంకకు వచ్చి, ముందుగా విభీషణుణ్ణి చూశాడు. విభీషణుడు దూతకు తగిన గౌరవ మర్యాదలు జరిపి, కుబేరుడు మొదలైనవారి క్షేమ సమాచారాలు అడిగి కనుక్కొని, అతను వచ్చిన పని తెలుసుకున్నాడు.

దూత కుబేరుడి మాటలుగా రావణుడితో ఇలా అన్నాడు:

"తమ్ముడా, ఇప్పటికే నీకు చాలా కీర్తివచ్చింది. అంతతో తృప్తిపడు. ఇక నుంచీ సాధ్యమైన మేరకు సాధు మార్గాన నడవటం మంచిది. నీవు ధ్వంసం చేసిన నందనవనాన్ని నేను కళ్ళారా చూశాను. ఋషులను చంపావని విన్నాను. నీచేత పీడించబడిన దేవతలు నీపై పగ తీర్చుకునే ప్రయత్నంలో ఉన్నట్టు తెలుస్తున్నది. నేనీ మధ్య రౌద్రవ్రతాన్ని నియమంగా చెయ్యగోరి హిమాలయానికి వెళ్లి, అక్కడ శివుడితో ఉన్న పార్వతిని చూశాను. మరే ఉద్దేశమూ లేకుండానే, పార్వతి సౌందర్యానికి బందీ అయి నా ఎడమ కన్ను ఆమె పైన పడింది. వెంటనే నా కన్ను దగ్ధమై, పింగళవర్ణం పొందింది. తరవాత నేను అపారమైన ఆ పర్వతం మీద మరొక చోటికి వెళ్ళి రౌద్రవ్రతం అవలంబించాను. వ్రత నియమం పూర్తి కాగానే, ఈశ్వరుడు మెచ్చి, తాను ఒకప్పుడీ వ్రతం చేసినట్టూ, అనంతరం నేను మాత్రమే ఈ వ్రతాన్ని పూర్తి చేసినట్టూ చెప్పి నన్ను తన స్నేహితుడుగా వుండమని కోరాడు. ఆయన నాకు ఏకాక్షీ పింగళుడనే పేరు కూడా పెట్టాడు. ఆయన వద్ద సెలవు పుచ్చుకుని ఇంటికి వచ్చేసరికి నీవు చేసే దుష్కృత్యాల మాట చెవిన పడింది. వంశానికి అపఖ్యాతి తెచ్చే ఇలాటి పనులు మాను, నాయనా. ఋషులూ, దేవతలూ చేరి నీ చావుకు ఉపాయ మాలోచిస్తున్నట్టు వింటున్నాను కూడా."

కుబేరుడి మాటలను ఈ విధంగా దూత చెప్పేసరికి, రావణుడు ఆగ్రహా

వేశంతో, ''ఓరీ, దూతా! ఈ మాటలు చెప్పిన నిన్నూ, చెప్పించిన నా అన్ననూ ఏం చేస్తానో చూడు. కుబేరుడా నాకు హితబోధ చేసేది? తనకు శివుడి స్నేహం దొరికిందని కబురు చేస్తాడా? పెద్దవాడూ, తండ్రిలాటివాడూ అని ఇంత కాలమూ చంపక మన్నించాను. నీ మాటలు విన్నాక మూడు లోకాలూ జయించాలని బుద్ధి పుట్టుతున్నది. మా అన్న కారణంగా మిగిలిన దిక్పాలకులను కూడా నాశనం చేస్తాను,'' అంటూ కుబేరుడి దూతను కత్తితో నరికి, రాక్షసులకు తినమని ఇచ్చి, ప్రయాణ సన్నాహం చేసి, రథమెక్కి మూడు లోకాలూ జయించటానికి బయలు దేరాడు.

అతను మొట్టమొదట కుబేరుడి పైకే వెళ్ళ నిశ్చయించుకుని; మహోదరుడూ, ప్రహస్తుడూ, మారీచుడూ, శుకుడూ, సారణుడూ, ధూమ్రాక్షుడూ అనే మహా శూరులైన ఆరుగురు మంత్రులతో బయలు దేరి, కొద్ది కాలంలోనే నదులనూ, కొండలనూ, వనాలనూ దాటి, కైలాసపర్వతం చేరాడు. అక్కడ రావణుడూ, అతని అనుచరులూ కూర్చుని ఉండటం చూసి, ఆ వచ్చినవాడు కుబేరుడి తమ్ముడేనని తెలుసుకుని, యక్షులు వెళ్ళి కుబేరుడితో చెప్పారు.



వెంటనే కుబేరుడు తన యక్షులను రావణుడి పైకి పంపుతూ, యుద్ధం చెయ్యమని ఉత్తరువిచ్చాడు. అసంఖ్యాకులైన యక్షులు వచ్చి, రావణుణ్ణీ, అతని మంత్రులనూ, చుట్టుముట్టి యుద్ధం ప్రారంభించారు. రావణుడి మంత్రి ప్రతి ఒక్కడూ వెయ్యేసిమంది యక్షులతో యుద్ధం చేశాడు. ఇక రావణుడు, ఎండు గడ్డిని అగ్ని దహించినట్టుగా యక్షులను నిర్మూలించాడు. ఈ యుద్ధంలో చచ్చిన యక్షులు చావగా, మిగిలినవారు పారి పోయారు.

ఈ సంగతి విని, కుబేరుడు మరి కొందరు యక్షులను రావణుడి పైకి

పంపాడు. వారిలో సంయోధకంటకు డనే వాడు మారీచుడిపై చక్రాయుధం ప్రయోగించి, కొండపై నుంచి కిందికి పడేటట్టు కొట్టాడు. మారీచుడు తెప్పరిల్లి తన పైకి వచ్చి యుద్ధం చేసేసరికి ఆ యక్షుడు పారిపోయాడు.

అలాగే అలకానగరం లోపలికి ప్రవేశించకుండా అడ్డంగా ఉండిన ఒక యక్షుణ్ణి, రావణుడు తోరణం పీకి, కొట్టి చంపేశాడు. తరవాత యక్షు లందరూ రణరంగం నుంచి భయపడి పారిపోయి, నదులలోనూ గుహలలోనూ దాక్కున్నారు.

తాను రెండోసారి పంపిన యక్షులు కూడా ఓడిపోయేసరికి కుబేరుడు మాణిభద్రు డనే మహాయక్షుణ్ణి రాక్షసుల పైకి పంపాడు. ఆ మాణిభద్రుడు నాలుగువేల మంది యక్షులను వెంట తీసుకుని యుద్ధం ప్రారంభించాడు. వారందరూ అనేక ఆయుధాలతో తమ మీద విరుచుకు పడేసరికి రాక్షసులు భయపడిపోయి పరిగెత్సాగారు. తరవాత ఉభయ పక్షాలకూ దొమ్మి యుద్ధం జరిగింది. ఆ దొమ్మి యుద్ధంలో ప్రహస్తు డొక వెయ్యిమంది యక్షులనూ, మహోదరుడు మరొక వెయ్యిమందినీ, మారీచుడు దారుణంగా రెండు వేలమంది యక్షులనూ చంపారు. మాయలు తెలియని యక్షులు మాయోపాయంలో ఆరితేరిన రాక్షసుల ముందెలా నిలుస్తారు ?

అయినా మాణిభద్రుడు గొప్ప యుద్ధం చేశాడు. ధూమ్రాక్షుడు తనను ముసలంతో గుండెల మీద కొట్టినా చలించక, మాణిభద్రుడు తన గద గిరగిరా తిప్పి నెత్తిన కొట్టేసరికి ధూమ్రాక్షుడు నేలకరిచాడు. అది చూసి రావణుడు మాణిభద్రుడి పైకి వచ్చాడు. మాణిభద్రుడు తన పైన మూడు శక్తులు వరసగా ప్రయోగించినా లక్ష్యపెట్టక, రావణు డతని నెత్తి మీద కొట్టాడు. ఆ దెబ్బతో మాణిభద్రుడి కిరీటం ఒక పక్కకు ఒరిగిపోయి, అతనికి పార్శ్వమౌళి అనే పేరు కూడా వచ్చేసింది.





# పోరులాభం!

చదువు పూర్తవుతూనే, రమాపతి అనే యువకుడికి, మునగాపురం జమీందారు కచ్చేరీలో మంచి జీతంమీద ఉద్యోగం దొరికింది. అతడు వెంటనే అత్తవారి గ్రామం వెళ్ళి, భార్య గిరిజతో తిరిగి వచ్చి, ఒక అద్దె ఇంట్లో కాపరం పెట్టాడు.

పల్లెగ్రామంలో పుట్టి పెరిగిన గిరిజకు, మునగాపురంలాంటి పట్టణ జీవితం కొంత ఇబ్బందిగా తయారైంది. వేళకు వంట పని పూర్తిచేసి, భర్తను కచేరికి పంపడం, ఆమెకు ఎంత ప్రయత్నించినా సాధ్యం కావడం లేదు. దీనితో రమాపతి, తన పై ఉద్యోగస్థుల నుంచి మాటపడవలసి వస్తున్నది.

ఒకనాటి సాయంత్రం రమాపతి కచేరీ నుంచి ఇంటికి వస్తూనే భార్యతో, ''నువ్వు వంటపనులు ఎలా ముగిస్తావో, నాకు తెలియదు. ఇక, రేపటినుంచి మాత్రం, నేను వేళకు కచేరీ చేరాలి. ఆ సంగతి గుర్తుంచుకో!'' అన్నాడు.

ఆ రాత్రి గిరిజకు నిద్రలేదు. ఆమె సగంరాత్రివేళే లేచి వంట ఆరంభించి త్వరగా పూర్తిచేసి, అనుకున్న సమయానికి రమాపతికి భోజనం పెట్టి, ఉద్యోగానికి పంపింది.

రమాపతి వీధి మలుపు తిరుగుతూండగా, ఎవరో తెలియని మనిషి ఒకడు చప్పున అతడి చేయిపుచ్చుకుని, ''మళ్ళీ రెండేళ్ళ తరవాత అనుకోకుండా కలుసుకున్నాం. నాకీ రోజు పెద్ద పండగలా వున్నది!'' అన్నాడు నవ్వుతూ.

రమాపతి క్షణకాలం నివ్వెరపోయి, ''మరేం అనుకోకండి. మీరెవరో నాకు తెలియదు,'' అన్నాడు.

ఆ మనిషి పెద్దగా నవ్వి, ''నీ పెళ్ళికి రాలేదన్న కోపం ఇంకా పోలేదన్నమాట!

మాచిరాజు కామేశ్వరరావు



పనివత్తిడి కారణంగా రాలేనని అప్పుడే రాశాగదా, వీరేశం!'' అన్నాడు.

రమాపతి, ''నా పేరు రమాపతి; వీరేశంకాదు. నేను త్వరగా వెళ్ళాలి,'' అంటూ చేయి విడిపించుకోబోయాడు.

కాని, ఆ కొత్తవాడు రమాపతి చేతిని మరింత గట్టిగా వడిసిపట్టుకుని, ''నువ్వు వీరేశాన్నికాదని చెప్పినా, నీ కుడి అరచేతిలోని పుట్టుమచ్చ సాక్ష్యం ఏమవుతుంది?'' అన్నాడు.

రమాపతి విసుక్కుంటూ, ''అయ్యా, నా ఎడమచేయి చిటికెన వేలు మీద తప్ప మరెక్కడా నాకు పుట్టుమచ్చల్లేవు. ఇక వదలండి!'' అన్నాడు.

ఇంత జరిగాక, ఆ కొత్తవాడు రమాపతి చేయివదిలి, ''క్షమించండి! నా స్నేహితుడు వీరేశం అనుకుని, మిమ్మల్ని ఇబ్బంది పెట్టాను. వాడికీ, మీకూ పోలికల్లో ఏస మెత్తు కూడా తేడా లేదు,'' అన్నాడు.

ఆ సాయంత్రం రమాపతి ఇల్లు చేరగానే, భార్య గిరిజ, ''ఈరోజు వెళ్ళవలసిన వేళకన్న ముందుగానే కచేరీకి చేరారుగదా?'' అని అడిగింది.

''అదేంలేదు! వీధి మలుపు తిరుగుతూండగానే, ఎవడో నన్ను జలగలాగా పట్టుకున్నాడు,'' అని రమాపతి ఉదయం జరిగినదంతా భార్యకు చెప్పాడు.

భర్త మాటల్లో వీరేశం అన్న పేరు విని గిరిజ, ''చెప్పమరిచాను. మధ్యాహ్నం మీ చిన్ననాటి స్నేహితుడు వీరేశం వచ్చాడు,'' అన్నది.

ఆ పేరు వింటూనే రమాపతి ఉలిక్కిపడి, ''ఆ పేరు గల స్నేహితుడెవడూ నాకు లేడు. ఇంతకూ అతనెక్కడ?'' అని అడిగాడు.

''ప్రయాణ బడలికగా వున్నదట. వెంట తెచ్చిన పెట్టె, మన గదిలోనే పెట్టుకుని, భోజనం కాగానే పడుకున్నాడు. ఇంతకు ముందే, అటు బజారుకు వెళ్ళి వస్తానని చెప్పివెళ్ళాడు,'' అని జవాబిచ్చింది గిరిజ.

రమాపతికి వెంటనే అనుమానం కలిగింది. అతడు గదిలోకిపోయి, వీరేశం అని చెప్పుకున్న మనిషి తాలూకు పెట్టె మూత తెరిచి చూశాడు. లోపల నాలుగైదు ఇటుకరాళ్ళున్నవి.

''వీడెవడో పెద్ద మోసగాడు. ఇంట్లోంచి ఏం ఎత్తుకు పోయాడో చూడు!'' అంటూ రమాపతి భార్యను కేక వేశాడు.

ఇద్దరూ కలిసి గదిలో వున్న పెట్టెలు తెరిచి చూడగా, ఒక పెట్టెలో వుండవలసిన నాలుగు వందల రూపాయిలూ, గిరిజ గాజుల జతా కనిపించలేదు.

రమాపతి ఎక్కడలేని కోపంతో భార్యను, ''నువ్వు పల్లెటూరి వెర్రిబాగుల దానివని తేలిపోయింది. ఎవరైనా ముక్కూ మొహం ఎరగని వాడికి భోజనం పెట్టి, గదిలో పడుకోనిస్తారా?'' అన్నాడు.

''వాడు మోసగాడని, నాకేం తెలుసు! మీ పేరు చెప్పాడు. మాటల సందర్భంలో, మీ చెటికెనవేలు మీది మచ్చ గురించి చెప్పాడు. మీరు పెట్టుకున్న పగడపు ఉంగరాన్ని వర్ణించాడు,'' అన్నది గిరిజ.

''అయితే, సందేహం లేదు. ఉదయం నన్ను పట్టుకుని, తెలివిగా నా నుంచి అన్ని వివరాలూ తెలుసుకున్నవాడే, ఈ మోసగాడు!'' అన్నాడు రమాపతి,

అతడిలా అనగానే గిరిజ అందుకుని, ''ఆహాఁ, వాడే! ఇంక అనుమానానికి తావే లేదు. వాణ్ణి వదిలించుకోవాలన్న ఆత్రం కొద్దీ, మీ గురించిన సర్వం వాడికి





నివేదించుకున్నారు. నేను పల్లెటూరు దాన్ని, సరే. మీ పట్నవాసపు తెలివి తేటలన్నీ ఏమయాయి!'' అని భర్తను దెప్పిపొడిచింది.

ఆ తర్వాత తప్పు నీదంటే నీదని, వాళ్ళిద్దరూ చాలా సేపు పోట్లాడుకుని, రాత్రి భోజనాలు చేయకుండా పడుకున్నారు.

మర్నాటి ఉదయం రమాపతి పొరుగూరు వెళ్ళి, నారాయణ అనే అతన్ని వెంటబెట్టుకు వచ్చాడు. ఈ నారాయణ గిరిజకు వరసకు బాబాయి అవుతాడు. అతనే వాళ్ళ పెళ్ళి కుదిర్చిన మధ్యవర్తి. బ్రహ్మచారి, ఏ బాదరబందీ లేని వాడు. అవసరం అయిన వాళ్ళకు పెళ్ళి సంబంధాలు ఏర్పాటు చేస్తూ, వాళ్ళ ఇళ్ళల్లోనే తింటూ కాలం గడుపుతాడు.

రమాపతి, భార్యను నారాయణకు చూపుతూ, ''ఈవిణ్ణి, నాకు ముడి వేసేందుకు, మీరు మూడు అబద్ధాలాడారు!'' అన్నాడు కోపంగా.

''ఏమిటా అబద్ధాలు?'' అని అడిగాడు నారాయణ.

''పిల్లచురుకైంది, తెలివైంది, వినయం గలది అని చెప్పారు. తెల్లవారి బారెడు పొద్దెక్కినా వంట పూర్తి చేయలేని, ఆ చురుకుదనం ఏమిటో, నాకు అర్థం కాదు. మోసగాడికి భోజనం పెట్టి, డబ్బున్న గదిలో పడుకోనివ్వడం, ఏం తెలివి తేటలు? ఇక, తాళి గట్టిన వాడితోనే పోట్లాడే ఆ వినయ గుణ మర్మం, మీకే తెలియాలి?'' అన్నాడు రమాపతి.

గిరిజ కన్నీళ్ళు పెట్టుకుని, జరిగినదంతా నారాయణకు చెప్పింది. అంతా విన్న నారాయణ చిన్నగా చిటిక వేసి, ''తప్పు మీ ఇద్దరిలో ఎవరిదీ కాదు. ఇలాంటి మోసం జరగడానికి మూల కారణం—ఇంట్లో పెద్ద దిక్కంటూ లేకపోవడం! ఆ లోటు నేను తీరుస్తాను, సరా! అమ్మాయ్, ఇక నుంచి రోజూ వెసట్లో మరో గుప్పెడు బియ్యం అద

నంగా వేస్తూ వుండు,'' అని చెప్పి, పెరటి బావి దగ్గరకు స్నానానికి వెళ్ళాడు.

ఆ తర్వాత పదిహేను రోజులకు రమాపతి, భార్యను, ''ఇంకా ఎన్నాళ్ళుంటాడు, మీ బాబాయి?'' అని అడిగాడు.

''నాకేం తెలుసు! వెళ్ళి తీసుకు వచ్చింది మీరు; సాగనంపే భారం కూడా మీదే,'' అన్నది గిరిజ.

శనిగ్రహంలా ఇంట చేరిన నారాయణను, వదిలించుకునే మార్గం ఏమిటని, రమాపతి బాగా ఆలోచించిన మీదట, అతడికో ఉపాయం తోచింది.

రమాపతికి ఒక పెద్ద తల్లి వున్నది. ఐదారేళ్ళ క్రితం ఆమె భర్త చనిపోతూ, తన ఒక్కగానొక్క కూతురు పెళ్ళి బాధ్యతను అతడి మీద పెట్టి పోయాడు. ఐతే ఆ అమ్మాయి అనాకారితనానికి తోడు గడుసూ, గయ్యాళిది కావడంతో, పెళ్ళాడేందుకు ఎవరూ ముందుకు రాలేదు. ఇప్పుడామె వయసు ముప్పై ఏళ్ళు.

రమాపతి ఒకనాటి సాయంకాలం, కచేరీ నుంచి వస్తూనే నారాయణను పిలిచి, తన పెద్ద తల్లి కూతురు గురించి చెప్పి, ''మా అక్కయ్యకు, మీరే ఏదైనా మంచి సంబంధం చూడాలి. మీ మేలు మరవం,'' అన్నాడు.

ఇందుకు నారాయణ ఒప్పుకుని, ఆ మర్నాడే బయలుదేరి వెళ్ళాడు. రమాపతికీ, గిరిజకూ కలిగిన సంతోషం అంతా యింతా కాదు. ఆ అమ్మాయికి పెళ్ళి



కుదర్చడం, ఈ సంవత్సరంలో అయ్యే పని కాదని, వాళ్ళిద్దరూ అనుకున్నారు.

అయితే, మూడో రోజు పొద్దునే బాడుగ బండిలో వచ్చి దిగిన నారాయణను చూసి, రమాపతీ, గిరిజా విస్తుపోయారు.

"ఇంత త్వరలోనే, మా అక్క సుకుమారికి తగిన వరుణ్ణి చూడగలిగారా?" అని రమాపతి, నారాయణను అడిగాడు.

"అహాఁ, అదెంత పని! ఆ వరుడెవ్వరని అడగరేం?" అన్నాడు నారాయణ.

"మీరే చెప్పండి!" అన్నాడు రమాపతి,

"ఈ నారాయణే!" అంటూ నారాయణ పెద్దగా నవ్వి, "సుకుమారికి నేను నచ్చాను; నాకు సుకుమారి నచ్చింది. మరొక సంబంధం చూసే శ్రమ ఎందుకు? నువ్వే చేసుకో అన్నది మీ పెత్తల్లి. వచ్చే బుధవారం నాడు ముహూర్తం. ఈ శుభ వార్త, మీ చెవిని వేసి, పెళ్ళికి ఆహ్వానించి వెళదామని వచ్చాను. పనిలో పనిగా, మీ కొక ముఖ్య విషయం కూడా చెప్పదలిచాను," అన్నాడు.

"ఏమిటది?" అని ఒకేసారి రమాపతీ, గిరిజా అడిగారు.

"పోరునష్టం, పొందులాభం అన్నది సామెత, కాని, మీ భార్యాభర్తల పోరు, నాకెలా లాభించిందో చూశారా?" అని అడిగాడు నారాయణ.

రమాపతీ, గిరిజా మౌనంగా వూరుకున్నారు. అప్పుడు నారాయణ పెద్దగా నవ్వి, "భార్యాభర్తలన్న తరవాత, అప్పుడప్పుడూ ఏవో కీచులాటలు రావడం సహజం. వాటిని మూడో వాడి ప్రమేయం లేకుండా, వాళ్ళే సరిదిద్దుకోవాలి. అలా కానప్పుడు, నాలాంటివాడు వచ్చి, ఇంట తిష్ఠ వేస్తాడు. వాడికి, మీపోరు మాన్పడం కన్న ఉచిత వసతి భోజన సౌకర్యాలు అనుభవించడమే సుఖంగా వుంటుంది. దాపరికం ఎందుకు—మీ, నా అదృష్టాల కొద్దీ, నాకీ పెళ్ళి కుదిరింది గాని, లేకపోతే ఇప్పట్లో, మీ ఇల్లు వదిలేవాణ్ణి కాదు. సరే, వస్తాను!" అంటూ బాడుగ బండి కేసి నడిచాడు.





# వింత వీలునామా

జెరుసలేము నగరంలో ఒక ప్రముఖ వర్తకుడు ఉండేవాడు. ఆయనకు ఒక్కడే కొడుకు. వర్తకుడు వ్యాపారం మీద చాలా వరకు దూరదేశాలలో గడిపేవాడు. అందు చేత ఆయన కొడుకు ఇంటి వద్దనే ఉండి చదువుకుంటూ ఉండేవాడు. వర్తకుడు వ్యాపారం చేస్తూ దేశాలు తిరిగేటప్పుడు ఆయన వెంట ఆయన బానిస ఉండేవాడు.

ఒకసారి వర్తకుడు దూర దేశంలో ఉండగా ఆయనకు తీరని జబ్బు చేసింది. తనకు చావు దగ్గిర పడుతున్నదని తోచి, వర్తకుడు తన కొడుకును గురించి ఆందోళనపడ్డాడు. వాడింకా పసివాడు. వర్తకుడు తన ఆస్తి అంతా తన కొడుకు పేర రాస్తే తన బానిసవాడు దాన్ని తేలికగా అన్యాక్రాంతం చేసి, తన కొడుకుకు ఏమీ మిగలకుండా చెయ్యవచ్చు. అలా జరగకుండా ఎలా వీలునామా రాయాలా అని దీర్ఘంగా ఆలోచించి, వర్తకుడు ఒక నిర్ణయానికి వచ్చాడు.

ఆయన తన వీలునామా రాయటానికి, ఒక లేఖకుణ్ణి పట్టుకు రమ్మని తన బానిసను నగరంలోకి పంపాడు. వాజ్మూలాలు మొదలైనవి రాయగల లేఖకుడు ఒకడు వచ్చి, వర్తకుడు చెప్పిన ప్రకారం ఆయన వీలునామా రాశాడు. ఆ వీలునామా ద్వారా వర్తకుడు తనకు గల యావదాస్తి తన బానిస పరం చేస్తూ, ఆ ఆస్తిలో ఏదో ఒక్కటి మాత్రం వర్తకుడి కొడుకు కోరుకోవచ్చునన్నాడు.

త్వరలోనే వర్తకుడు జబ్బుతో మరణించాడు. ఆయన బానిస ఆ వీలునామా పుచ్చుకుని జెరుసలేము నగరానికి తిరిగి వచ్చాడు. వాడు తన వద్ద ఉన్న వీలునామా ప్రకారం వర్తకుడి ఆస్తి యావత్తూ స్వాధీనపరచుకున్నాడు.

యూదు జానపద కథ

తన తండ్రి చనిపోయాడని తెలిసి వర్తకుడి కొడుకు తన తండ్రి ఆస్తి అంతా తన పరం చెయ్యమని బానిసను అడిగాడు.

బానిస ఆ పని చెయ్య నిరాకరిస్తూ, వర్తకుడి వీలునామా ఆ కుర్రవాడికి చూపి, ''చూడు, ఇది నీ తండ్రి చనిపోతూ రాయించిన వీలునామా. దీని ప్రకారం నీ తండ్రి ఆస్తి అంతా నాకు చెందుతుంది. కావాలంటే నువు ఆ ఆస్తిలో ఏదో ఒకటి కోరుకుని తీసుకోవచ్చు,'' అన్నాడు.

వర్తకుడి కొడుకు ఆ వీలునామా చూసి దిగ్భ్రమ చెందాడు. అతనికి ఏం చెయ్యటానికీ పాలుపోక, తన తండ్రికి మిత్రుడైన ఒక వృద్ధుని వద్దకు వెళ్ళి, సంగతి అంతా చెప్పి, ఆయనను సలహా అడిగాడు.

ఆ వృద్ధుడు గొప్ప మేధావీ, లౌకికుడూనూ. ఆయన కుర్రవాడి మాటలు విని, ''బాబూ, నువు ఏ మాత్రమూ విచారించకు. నీకు వచ్చిన నష్టం ఏమీలేదు. అలా వీలునామా రాసి నీ తండ్రి నీకు గొప్ప మేలు చేశాడు. రేపు న్యాయస్థానానికి రా. మీ తండ్రి రాసిన వీలునామా తీసుకుని మీ బానిసను కూడా రమ్మను. అక్కడ నువు నా సలహా ప్రకారం మసులుకుంటే అంతా చక్కబడుతుంది,'' అన్నాడు.

మర్నాడు ఉదయం వర్తకుడి కొడుకూ, వర్తకుడి వీలునామాతో సహా బానిసా హాజరయారు. న్యాయాధికారి సమక్షంలో వీలునామా చదివారు.

''అయితే, మీ తండ్రి ఆస్తి నుంచి నువు ఏమి కోరుకుంటావు?'' అని న్యాయాధికారి వర్తకుడి కొడుకును అడిగాడు.

ఆ ప్రశ్నకు ఏమి సమాధానం చెప్పాలో వృద్ధుడు ముందే తనకు చెప్పి ఉండటం చేత, వర్తకుడి కొడుకు తన తండ్రి బానిసను చూపి, ''నేనా బానిసను కోరుకుంటున్నాను,'' అన్నాడు.

న్యాయాధికారి బానిసను వర్తకుడి కొడుకు పరం చేశాడు. ఆ విధంగా బానిస వాడి అధీనమైన వర్తకుడి ఆస్తి యావత్తూ వర్తకుడి కొడుకు పరమయింది.






# అభూతకల్పనలు

ఒక గ్రామంలో నలుగురు కుర్రాళ్ళుండే వారు. వారు ఎప్పుడూ ఏవో విడ్డూరాలు కల్పించి మాట్లాడుతూ ఉండేవారు.

ఒకనాడు గ్రామం చివర ఉండే సత్రానికి పొరుగూరి వాడొకడు రావటం వాళ్ళు చూశారు. ఆ మనిషి మంచి బట్టలు కట్టుకుని ఉన్నాడు. ఆ బట్టలు కాజెయ్యాలని నలుగురు కోతలరాయుళ్ళకూ కోరిక కలిగింది. అందుకోసం వాళ్ళు సత్రానికి వెళ్ళి పొరుగూరి వాణ్ణి పలకరించి, అదీ ఇదీ మాట్లాడారు.

చివరకు కోతలరాయుళ్ళలో ఒకడు, "ఒక చిన్న పందెం వేసుకుందాం. ఒక్కొక్కడూ తనకు కలిగిన వింత అనుభవాన్ని చెప్పాలి. వినేవాళ్ళలో ఎవడైనా ఆ అనుభవాన్ని నమ్మకపోతే, నమ్మని వాడు కథ చెప్పినవాడికి దాసుడైపోవాలి," అన్నాడు. ఇందుకు పొరుగూరి వాడు కూడా ఒప్పుకున్నాడు. కోతలరాయుళ్ళు సంతోషించారు. ఎందుకంటే వాళ్ళు చెప్పే కథలు ఎవరికీ నమ్మశక్యంగా ఉండవు. పొరుగూరి వాడు తప్పక దొరికి పోతాడు—అని కోతలరాయుళ్ల నమ్మకం.

మొదటివాడు తన కథ ఇలా చెప్పాడు:

"మా అమ్మ నన్ను కడుపుతో ఉండి, మా ఇంటి కెదురుగా ఉన్న నేరేడుచెట్టు పళ్ళు తినాలని ఉన్నదని మా నాన్నతో అన్నది. అంత ఎత్తు చెట్టు తాను ఎక్కలేనని మా నాన్న అన్నాడు. మా అన్నల నడిగితే వాళ్ళూ అలాగే చెప్పారు. నాకు జాలి వేసి, మా అమ్మ కడుపులో నుంచి బయటికి వచ్చి, నేరేడు చెట్టెక్కి పళ్లన్నీ కోసి తెచ్చి వంట ఇంట్లో దాచిపెట్టాను. తరవాత ఏమీ ఎరగనట్టు మళ్లీ మా అమ్మ కడుపులో దూరాను. తరవాత మా అమ్మ తనకు కావలిసినన్ని తిని, మిగతావి

ఊరంతా పంచిపెట్టి, అప్పటికీ మిగిలిన పళ్ళు ఇంటి ముందు పారేస్తే అవి ఇల్లంత ఎత్తు గుట్ట అయి, వీధిలో నుంచి ఇల్లు కనపడకుండా పోయింది.''

ఈ కథ చెప్పి కోతలరాయుడు పారుగూరి వాడి కేసి చూశాడు. పారుగూరి వాడు తాను కథ నమ్మినట్టుగా తల ఆడించాడు. మిగిలిన ముగ్గురు కోతలరాయుళ్లూ తలలు ఆడించారు.

అప్పుడు రెండో కోతలరాయుడు ఈ విధంగా కథ చెప్పాడు:

''నేను వారం రోజుల వయసువాణ్ణయి ఉండగా అడవికి షికారు వెళ్ళాను. అక్కడ ఒక చింతచెట్టు కనిపించింది. దాని నిండా పండిన చింతకాయలున్నాయి. నాకు ఆకలిగా ఉండటం చేత వెంటనే చెట్టెక్కి కడుపునిండా చింతగుల్లలు తిన్నాను. దాంతో పొట్ట బరువెక్కి, నిద్ర మత్తు వచ్చేసి కిందికి దిగటం అసాధ్యమయింది. అందుకని నేను ఊళ్ళోకి వెళ్ళి, ఒక నిచ్చెన పట్టుకొచ్చి చింత చెట్టుకు వేసి, దాని మీదుగా దిగి వచ్చాను. ఇంకా నయం, నాకు ఊళ్ళో నిచ్చెన దొరికింది; లేకపోతే ఆ చెట్టు మీద ఉండి పోవలిసినవాణ్ణే!''

ఇది కూడా నమ్మినట్టుగానే పారుగూరి వాడు తల ఆడించాడు. మిగిలిన ముగ్గురు కోతలరాయుళ్ళూ తలలు ఆడించారు.

అప్పుడు మూడో కోతలరాయుడు ఈ విధంగా కథ చెప్పాడు:



''నేను మాంచి కుర్ర వయసులో ఒకనాడు కుందేలు లాటిది కనిపిస్తే దాని వెంట పడ్డాను. అది కాస్తా ఒక పొదలో దూరింది. దాని వెనకగా నేను కూడా పొదలో దూరి చూతును గదా, అదొక పెద్దపులి. అది నన్ను మింగాలన్న ఉద్దేశంతో నోరు తెరిచింది. నన్ను మింగటం అన్యాయమనీ, అది కుందేలనే పొరపాటుతో దాన్ని తరిమాననీ మంచిగా చెప్పాను. అది నా మాట వినిపించుకోక, నోరు తెరిచి నా పైకి వచ్చింది. నాకు చిరాకెత్తి ఎడమచేత్తో దాని పైదవడ పట్టుకుని పైకి ఒక్క గుంజు గుంజాను. ఆ దెబ్బతో పులి రెండుగా విరిగి చచ్చి ఊరుకుంది.''

ఈ కథ కూడా తాను నమ్మినట్టే పొరుగూరి వాడు తల ఆడించాడు. మిగిలిన ముగ్గురు కూడా తలలు ఆడించారు.

అప్పుడు నాలుగో కోతలరాయుడు తన కథ ఇలా చెప్పాడు:

''కిందటేడు చేపలవేటకు వెళ్ళాను. ఒక్క చేప కూడా దొరికింది కాదు. మిగిలిన పల్లెవాళ్ళ నడిగితే తమకు కూడా చేప అన్నది చిక్కలేదన్నారు. నది అడుగున ఏదో జరుగుతూ ఉండి ఉంటుంది, అదేమిటో చూతామని నేను నా పడవలో నుంచి నీటిలోకి దూకాను. నది అడుగున కొండంత చేప ఒకటి ఉండి, ఇతర చేపలన్నిటినీ తినేస్తున్నది. ఒక్క గుద్దుతో ఆ పెద్ద చేపను చంపేశాను. అకలిదహించుకు



పోతూండటం వల్ల నేను అక్కడే నిప్పు రాజేసి ఆ చేపను కాల్చేసి దాన్ని సాంతం తినేశాను. తరవాత నీటి పైకి వచ్చి, నా పడవలో ఎక్కి ఇల్లు చేరుకున్నాను.''

ఈ కథను కూడా నమ్మినట్టే పొరుగూరి వాడు తల ఆడించాడు. మిగిలిన ముగ్గురు కూడా విధిగా తలలు ఆడించారు.

ఇప్పుడు పొరుగూరి వాడికి కథ చెప్పే వంతు వచ్చింది. వాడు ఇలా చెప్పాడు:

''కొంతకాలం కిందట నాకొక పత్తితోట ఉండేది. అందులో ఒక పత్తి చెట్టు మరీ పెద్దది. ఎర్రగా ఉండేది. మొదట్లో దాని కొక ఆకుగాని, కొమ్మగాని లేదు. తరవాత అది నాలుగు కొమ్మలు వేసింది. ఒక్కొక్క కొమ్మకూ ఒక్కొక్క కాయ కాసింది. నాలుగు కాయలూ కోసి పగలదీసేసరికి నాలుగింటి నుంచీ నలుగురు యువకులు బయటికి వచ్చారు. వారు నా పొలంలో కాసిన కాయలలో వాళ్లు గనక నలుగురూ నాకు బానిసలే. వాళ్ళచేత పొలంలో పని చేయించాను. వట్టి సోమరిపోతులు కావటం చేత, కొద్ది వారాలు పని చేసి వారు పారిపోయారు. వారిని వెతుకుతూ బయలు దేరి చివరకు ఇక్కడ వాళ్ళని పట్టుకున్నాను. మీరే ఆ నలుగురూనూ—నా వెంట నా పొలానికి వచ్చెయ్యండి!''

ఈ కథ విని నలుగురు కోతలరాయుళ్లూ తలలు దించేసుకున్నారు. వాళ్ళకు పెద్ద చిక్కే వచ్చింది. కథ నిజమని ఒప్పుకుంటే తాము ఆ పొరుగూరి వాడి బానిసలని ఒప్పుకోవాలి. కథ అబద్ధమంటే పందెం ప్రకారం అతడికి దాసులు కావాలి.

సత్రంలో ఉన్న ఇతరులు కోతల రాయుళ్లను, "ఆ కథ నిజమో, అబద్ధమో చెప్పరేం?'' అని అడిగారు. కాని వారు ఏ సమాధానమూ చెప్పక మూగవాళ్ళలా చూస్తూ వూరుకున్నారు.

''సరే, మీ వంటి మీద ఉన్న బట్టలు నా కిచ్చెయ్యండి. నేను మీకు స్వేచ్ఛ ఇస్తాను,'' అని పొరుగూరి వాడు, వాళ్ళ బట్టలు పుచ్చుకుని ఆ వూరు విడిచి తన దారిన వెళ్ళి పోయాడు.



## తడిలేని ప్రాంతం

చిలీదేశంలోని అటకామా ఎడారి, ప్రపంచంలోకెల్లా ఏమాత్రం తడిలేని పొడి ప్రాంతంగా భావించబడుతున్నది. దాదాపు 400 సంవత్సరాలుగా అక్కడ చెప్పుకోదగిన వర్షపాతం లేదు।

## భూమి అడుగున పూచే మొక్క



ఆస్ట్రేలియాలో కనిపించే రిజాన్‌థేలియాగార్డ్‌నేరీ అనే పూలమొక్క భూమిలోపలే పూస్తుంది।




## మహావృక్షం!

ప్రపంచంలోకెల్లా పెద్ద వృక్షం కాలిఫోర్నియాలో ఉన్నది. అందరిచేతా జనరల్ షర్మన్ అని ముద్దుగా పిలువబడే ఈ వృక్షం 272 అడుగుల ఎత్తూ, 79.1 అడుగుల చుట్టుకొలతా, 2030 టన్నుల బరువూ కలిగి ఉన్నది.

## ఫోటో వ్యాఖ్యల పోటీ : : బహుమానం రు. 50 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1986 డిసెంబర్ నెల సంచికలో ప్రకటింపబడును.



S. B. Prasad



M. Natarajan

★ పై ఫొటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్కమాటలో గానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.) ★ అక్టోబర్ నెల 15వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. ★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 50/–లు బహుమానం. ★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన రాసి, ఈ అడ్రసుకు పంపాలి : – చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు-26

---

### ఆగస్టు నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : నా పోషణభారం నీదే! రెండవ ఫోటో : నీ జీవనాధారం నేనే!

పంపినవారు : కె. నగేష్, కొత్తఅగ్రహారం, విజయనగరం-531201

బహుమతి మొత్తం రు. 50/– నెలాఖరులోగా పంపబడుతుంది.


### చందమామ

ఇండియాలో సంవత్సర చందా : రూ. 30-00

చందా పంపవలసిన చిరునామా :

డాల్టన్ ఏజన్సీస్, చందమామ బిల్డింగ్స్, వడపళని, మద్రాసు-600 026.

ఇతర దేశాల చందా వివరాలకు రాయండి :

చందమామ పబ్లికేషన్స్, చందమామ బిల్డింగ్స్, వడపళని, మద్రాసు-600 026.

Printed by B.V. REDDI at Prasad Process Private Ltd., 188 N.S.K. Salai, Madras 600 026 (India) and Published by B. VISWANATHA REDDI on behalf of CHANDAMAMA PUBLICATIONS, Chandamama Buildings, Vadapalani, Madras 600 026 (India). Controlling Editor: NAGI REDDI.

# రామ్, శ్యామ్

## అడవి మనుషులతో అనుభవం

PARLE






















